


బి.గోపాల్ కె.అశోక్ కుమార్

JAGATI Rs. 3-00 April 1988

33rd Year of Publication




# ఉగాది – 1988




'డ్రెస్‌ని బట్టి మగా ఆడా తెలుసుకొనే రోజులు పోయాయి గనక'

—'జర్మన్ న్యూస్ వీక్లీ' సౌజన్యంతో

'జగతి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24-00, 2 సం॥లకు రు. 45-00, 5 సం॥లకు రు. 100-00. జీవిత చందా రు. 300-00, విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

# నిమ్మతొనలు

నా నవల 'ముందు మాట'లో ఎక్కువగా ముఖచిత్రం గురించి, ప్రింటింగ్ గురించి రాసారు. నవల గురించి రాయలేదేం? - అని వాపో యింది రచయిత్రి.

'అలాగా - నవల గురించి రాసేందుకేమైనా ఉంటే కదా' - అని సర్ది చెప్పాడు, ముందుమాట రాసి నాయన.

—యమ్ వీరేశ్వర్రావు
అమలాపురం

పాపం, సుబ్బారావ్ తన ప్రేమికు రాలితో ఇలా మొరపెట్టుకున్నాడు:

'సంధ్యా,.... ఒకసారి ఇటు చూడు, సంధ్యా - నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. నిన్ను ఎలాగైన పెళ్ళిచేసుకోవాలను కుంటున్నాను. నా కోరికను నెరవేర్చి పుణ్యం కట్టుకో సంధ్యా. నువ్వు ఏం చెప్తే అది చేస్తాను, సంధ్యా" అని ఆలాపన చేశాడు సుబ్బారావు.

'అయితే నువ్వు ఇంకొక అమ్మా యిని ప్రేమించు'

'ఆ' అంటూ తెల్లబోయాడు పాపం సుబ్బారావు.

—యన్నెస్ నాగేంద్రప్రసాద్
మచిలీపట్నం

మీ అబ్బాయి రూపాయి బిళ్ళ మింగినప్పటినుంచి, ఆయనెవరో పాపం, అబ్బాయి ఆపరేషన్ గురించి ఆత్రుత పడుతున్నారు. ఆయన మీ బంధువా ?'

'కాదండీ, ఆయన మా ఎదురిం టాయన. మా అబ్బాయి మింగిన రూపాయి బిళ్ళ ఆయనదే. అపరేష నయితే తీసుకొని పోవాలని, ఆయన తపన.'

— కె. నాగేశ్వరరావు
నరసరావుపేట

దేశ పరిస్థితి గురించి సభ వున్నది ఈ కరపత్రం మీవారి కివ్వండి'- అని కోరాడతను సుగుణని.

'మాకు తెలియదు. మావారు లేరండి - మాకు అవసరం లేదండి ఈ కరపత్రం' అన్నదామె.

'అక్కడ డబ్బు ఇవ్వనవసరం లేదండీ.' -'ముందేఆమాట చెప్పవేం?

—బి. పరమేశ్వర్
హైదరాబాదు

ఉషా, నావల్ల పొరపాటు జరిగి నువ్వు నెల తప్పావు.... నేను దుర్మార్గుడ్ని, పాపాత్ముడ్ని, నీ కన్యా యం చేశాను. నన్ను క్షమించు, ఉషా

క్షమించు,' అంటూ ఉష పట్టుకు వల వల ఏడ్చాడు కిషోర్.

'అరే లే, కిషోర్ - ఈ మాత్రం దానికే ఇంత బాధ పడాలా? ఇలాంటి అనుభవాలు కొత్తకాదు. టేక్ ఇట్ ఈజీ' అంటూ ఓదారుస్తున్న ఉష మాటలకు మూర్ఛపోయాడు.

—రమ్యప్రియ

జగ్గయ్యపేట

ఏవండీ, సాయంత్రం నేనూ బాబిగాడు బీచ్‌కి వెళ్తున్నాం.'

'అసలే తుఫాన్ వచ్చేలా వుంది కదా. బాబిగాడు కూడా ఎందుకు? నువ్వు ఒక్కత్తివూ వెళ్ళరాదూ?'

—జివిన్ శర్మ

అమలాపురం

ఏరా రెండు కుక్కలకీ పుట్టిన రోజు ఇంత వైభవంగా ఇంత ఖర్చుపెట్టి చేయిస్తున్నారెందుకు? ఇందులో ఏదన్నా విశేషముందా? ఆశ్చర్యంగా అడిగాడు కాంతారావు.

"ఇంతవరకు మా అప్పులవాళ్ల బారినుంచి మమ్మల్ని రక్షించింది. ఈ రెండేగా - అందుకని!" - అసలు సంగతి చెప్పాడు ధర్మారావు.

—భవాని

మచిలీపట్నం

ఏరా రామూ రాస్కెల్, నువ్వు మా శాంతి వెంటపడుతున్నావట నీకు బ్రతకాలని లేదా?' కోపంగా అడిగాడు లెక్చరర్ విష్ణుమూర్తి.

'మొన్న మీరు పాఠం చెప్పేటపుడు మనమంతా కలిసి కట్టుగా ఉండి శాంతి భద్రతలని చూడాలని మీరన్నారుగా - అందుకని ఏదో నావంతుగా నేను మీ శాంతిని భద్రంగా చూస్తున్నాను సార్' అన్నాడు విద్యార్థి రాము.

—జి మాధవి

నందిగామ

# పాఠకుల తీర్పు

మిత్రులు శ్రీ చందూర్ గారికి హృదయ పూర్వక నమస్కారములు... చాలా రోజులుగా మీకు ఉత్తరం వ్రాయాలని ప్రయత్నం. బాలాజీ సంగీతోత్సవాల వల్ల మూడు రోజులపాటు మధుర సంగీతాన్ని ఆలకించ గలిగాము; ఆ స్వల్ప కాలంలోనే సన్నిహిత మిత్రులం కావడం, కలిసి కబుర్లు చెప్పుకున్నది కొద్ది గంటలే అయినా ఎన్నేళ్లుగానో సన్నిహితులైన మిత్రులుగా కలిసిపోయాం. ముఖా ముఖి కలుసుకొనకపోయినా, శ్రీమతి మాలతీ చందూర్, శ్రీ చందూర్ గార్ల పేర్లు చిరకాలంగా పరిచయం కావడం, బహుశా దీనికి కారణాలలో ఒకటి, రెండవది మీ స్నేహశీలత – ఆ కొద్ది సేపు చాలా హెూమ్లీగా ఫీలయ్యాము. మీరు వెళ్లిన తర్వాత అదే అనేక సార్లు అనుకున్నాము 'జగతి' లో ఆడంబరం లేకుండా ఒక పెర్సనల్ టచ్ ఉంది.... మీ సహృదయత మరువలేనిది. మీకు, శ్రీమతి మాలతీ చందూర్ గారికి మహలక్ష్మి నమస్కారాలని వ్రాయమంది.

—కందూకూరి సూర్యనారాయణ

న్యూఢిల్లీ-67

ప్రియమైన ఎడిటర్ గారికి, నేను 'జగతి' మాసపత్రిక అభిమానిని. ప్రతి నెలా చదువుతాను. అందులోని అన్ని రచనలు మంచిగా యున్నవి. ప్రారంభంలో వేసే కార్టూన్‌కి ఒక ప్రత్యేకత యున్నది. 'నిమ్మతొనలు' తియ్యగా పుల్లపుల్లగా యుంటున్నవి. 'డైరీ' పేజీలు నాకు ఎంతయు ఇష్టము.

—టి ఈశ్వర్

సికింద్రాబాద్

చందూర్‌జీ: నమస్కారములు. మీ దంపతుల గురించి వినడమే గాని నేను మిమ్మల్ని ఎప్పుడూ చూడలేదు. మాలతీ చందూర్ గారి నవలలు చదివాను. కాని, మీరు వ్రాసిన పుస్తకాలలో ఏ ఒక్కటీ చదివిన గుర్తులేదు. 'జగతి' పత్రిక మాత్రం నాలుగేళ్లగా చూస్తున్నాను. రెండు తడవలు మీకు ఉత్తరం రాదామనుకొని, మొదలు పెట్టి, మళ్లీ సందేహించాను. అయితే, మా అమ్మాయి భర్తృహరి పద్యాలు, వేర్వేరు శతకాలలోని పద్యాలు గడ గడ వొప్పజెబుతూంటే, సంతోషం ఆపుకోలేక, మిమ్మల్ని అభినందించేందుకు యిది వ్రాస్తున్నాను. 'ప్రాచీన సాహితి' ఒక్క పేజీ చాలు మీ పత్రిక విలువ నిర్ణయించడానికి - అది నా దృష్టిలో శిరోభూషణం. మీ దంపతులకు సర్వదా శుభము కలగాలని కోరుకొనే ఒక సోదరి,

—ఆర్ జయలక్ష్మి

బొంబయి-52

# ప్రాచీన సాహి

పాత్రము పాణి పంకజము భైక్షము భోజ్యమ నల్ప తల్ప మీ
ధాత్రి దిశాష్టకంబు పరిధానమగున్ భువి నేరి కాసు బా
రిత్రుల సంగతా గుణధురీణులు రీణసుఖానుభూతికిం
బాత్రులు మోహపాశముల బాసి దహింతు కరుర్మబీజమున్

—భర్తృహరి

మగువ నిన్నే కాని మనసులో వేఱొక్క
తెఱవ దలంచ భూదేవి యాన
అతివ నిన్నే కాని యాసతో వేఱొక్క
వనిత గోరను నభోవాణి యాన
సుదతి నిన్నే కాని చూడను వేఱొక్క
పడతిని భారతీ భర్త యాన
పొలతి నిన్నే కాని పూనిక వేఱొక్క
కలికి నెంచను రమాకాంత యాన
అబల శివు నాన నే గోర నన్య సతుల
నొప్పకొను మింక నితర మే నొక్క టెఱుగ
భావ మందైన దప్ప నీ పదము లాన
తాళ నిచ్చునె ప్రేమ కాంతాలలామ

—కాంతాలలామ శతకం

అనయము పుట్టె జూదమున యప్పుడ యెంతయు జిచ్చువెట్టి కా
ల్చినయది నీ యుపేక్షయ వశీకృత్త చిత్తుడు ధర్మసూతి మె
త్తనివులి యెల్లవారలు నధర్మము నీపయి బెట్టునంతకు
న్వినడును గానడుం బిదప నీకును నాకు మరల్పవచ్చునే

—కృష్ణుడు ధృతరాష్ట్రునితో.... 'తిక్కన' భారతంలో

# పాతికేళ్ళనాటి పిక్చర్

## పిఏపి వారి
## 'పునర్జన్మం'

'రాండమ్ హార్వెస్ట్' చిత్రం వెలువడి పన్నెండేళ్లకు పైగా అయి వుంటుంది. కాని, దానిని మనసులో పెట్టుకు ప్రయత్నాలు చేయడం మన వాళ్లు యింకా మానలేదు. ఈ కోవకు చెందిన వాటిలో ప్రథమ ప్రయత్నం గోపీచంద్‌ది. ఆ తర్వాత ఎందరో చేశారు. కాని, నేటి పి.ఎ.పి వారి ప్రయత్నంలో కొంత గంభీరత, నిండుతనమూ వున్నాయి. భారతస్త్రీ హృదయ సౌందర్యానికి అనుగుణంగా కథా సంవిధానాన్ని తీర్చి దిద్దారు. గానా బజానా స్థితి నుంచి బయటపడి, తన జీవితాన్ని పునీతం చేయగల మాంగల్యం కోసం ఆరాటపడే రాధ; తన మనసుకి నచ్చిన వన్నెకాడైనప్పటికి, తనది కాని ప్రేమను అపహరించడానికి యిచ్ఛగించని త్యాగశీలి వాసంతి – వీరు యిరువురూ నవయుగ నారీలోకానికి ఆణిముత్యాలు.... కళా ప్రియుడైన గోపీకి (నాగేశ్వరరావు), తను చెక్కిన సుందర శిల్పం అగ్నికీలలకు ఆహూతి అవడంతో మతి తప్పుతుంది. ఈ పిచ్చి కుదిర్చేందుకు ఒక అందమైన అమ్మాయి లాలన – పాలన కావాలనీ, ఆమె నయగారాలూ గానసుధలూ ఈ మతి భ్రమణను మార్చగలవనీ అంటాడు డాక్టరు. గోపీ తండ్రి (గుమ్మడి) నాట్యకత్తెల బజారుకి వెళ్ళి, వెల మాట్లాడి, రాధను (కృష్ణకుమారి) తమ ఇంటికి తీసుకువస్తాడు. ఈ కొడుకు బాగుపడటమే ఆయనకు కావల్సింది. గోపీని మనుషుల్లో పడేస్తుంది రాధ. పిచ్చిపోగానే, తను పిచ్చిలో తాళిగట్టిన రాధ సంగతి మర్చిపోయి, వాసంతి (వాసంతి) వెంట పడతాడు గోపీ. తను అస్వస్థుడుగా వున్నప్పుడు తనకు సేవచేసినది వాసంతే అనుకుంటాడు. ఆ సేవా భాగ్యం తనది కాదని వాసంతి ధైర్యంగా ఒప్పేసుకుంటుంది.... సంభాషణలు పదునుగా, పాటలు సుశ్రావ్యంగా ఉన్నాయి. అందాల పాలవెల్లిగా కృష్ణకుమారి, కళా శిల్పిగా నాగేశ్వరరావు తమ పాత్రలు కడురమణీయంగా పోషించారు. దర్శకత్వం ప్రత్యగాత్మ. సామాజికులు మెచ్చే ఈ సాంఘిక చిత్రానికి నిర్మాత పిఏపి సుబ్బారావు.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' – ఏప్రిల్ 1963

---

నా దేశమే నా ప్రపంచం; మంచిని పెంచడమే నా మతం.

థామస్ పెయిన్

# వెన్నెల కెరటాలు

## ఎముక వైద్యం

ఈ నూతన ఆర్థోపెడిక్ చికిత్సా పద్ధతిని గత 37 యేళ్లగా వుపయోగిస్తున్నట్టు బొంబాయిలో ఒక పత్రికా సమావేశంలో ప్రొఫెసర్ ఇలిజారవ్ చెప్పారు. యీ చికిత్సలోని మౌలిక లక్షణ మేమంటే యిందులో రక్త స్రావం వుండదు, శస్త్రచికిత్స అవసరం వుండదు. యెముక తిరిగి అతుక్కోడానికి పూర్తిగా అవసరమైన జీవ సంబంధ పరిస్థితులను సృష్టించడం జరుగుతుంది; అది సజీవస్నాయువు కన్నా యెంతో బాగా మానేటట్టు చేయగలదు. నయమౌతున్న యెముక స్నాయువులను చాలా తక్కువగా సాగలాగడం, యెముకను కచ్చితంగా అతికించడం - యిదీ యీ నూతన పద్ధతిలోని సారాంశం. 20 భాగాలు గల ఒక సాధనాన్ని యీ నూతన పద్ధతిలో వుపయోగిస్తారు. యీ భాగాలను అనేక విధాలుగా కూర్పు చేయవచ్చు. యెముక విరిగిన చోట సన్నటి రెండు స్టెయిన్‌లెస్ స్టీల్ సూదులను యెముక లోపలి నుంచీ రెండువైపులకూ అమర్చి వాటిని రింగులతో చుట్టూ బిగిస్తారు. యీ రింగులను మరలతోటె స్టెన్ బార్లకు అనుసంధిస్తారు.

—అంద్రూ కొలాకొ

'సోవియట్ భూమి'లో

## విద్యుత్

ప్రస్తుతం రాష్ట్ర అవసరాలను తీర్చుకో గలందులకు వీలుగా విద్యుదుత్పాదన రంగం అభివృద్ధి చెందిందని చెప్పవచ్చు. వివిధ కేంద్రాలలో థర్మల్ విద్యుచ్ఛక్తి 1193 మెగా వాట్లు ఉత్పత్తి అవుతుండగా, జల విద్యుచ్ఛక్తి 2173 మెగావాట్లు ఉత్పత్తి అవుతున్నది. రాష్ట్రంలో విజయవాడ, కొత్తగూడెం, రామగుండం, నెల్లూరులో థర్మల్ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి అవుతున్నది. మాచ్ ఖండ్, తుంగభద్ర లలో ఆంధ్రప్రదేశ్ వాటితో కలుపుకొని ఎగువ సీలేరు, దిగువ సీలేరు, నాగార్జునసాగర్, సాగర్ కుడికాలువ, డొంకరాయి, శ్రీశైలం, నిజాంసాగర్‌లలో జలవిద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేస్తున్నారు. శ్రీశైలం జలవిద్యుచ్ఛక్తి పథకం 2వ దశ నిర్మాణంలో వున్నది. ఇక్కడ 110 మెగావాట్ల శక్తిగల 3 యూనిట్లు నెల కొల్పేందుకు రంగం సిద్ధమైంది. ఒక యూనిట్ 1986 ఫిబ్రవరిలో ప్రారంభమైంది. మిగిలిన 2 యూనిట్లు ప్రారంభానికి సిద్ధంగా వున్నాయి.

—జి ఆంజనేయులు

'యోజన'లో



## గజబలం

1582లో అక్బరు, తన మీదకు తిరగబడిన అతని సోదరుడు హకీమ్‌ను అణచివేయడానికి కాబూల్ మీదకు దండయాత్ర జరిపాడు. ఈ దండయాత్రలో, తొండాలకు పెద్ద కత్తులు, దంతాలకు చిన్నకత్తులు కట్టబడిన అనేక ఏనుగులు అక్బరుకు ఉండేవి. ఇనుప, ఉక్కు డెక్కలు, అతి పదునైన విషపూరితం చేయబడ్డ బాణాలు తీసుకువెళ్ళేవారు. నలుగురు సైనికులు ఒక్కో ఏనుగుమీద ఉండి, కత్తులు, బాణాలు, ఈటెలు వాడేవారు. అందరికన్నా ఎక్కువ సాయుధుడే జంతువును నడిపేవాడు. అతను మధ్యన ఉండి శత్రువుల దాడిని ఎక్కువ ఎదుర్కోవలసి వచ్చేది. ఈ దాడిలో ఒక తుపాకి హకీమ్ యొక్క ముగ్గురు సేనాధిపతులను హతమార్చటం వల్ల, ఇతరులు పారిపోయారు. హకీమ్ ఓటమిని అంగీకరించి లొంగిపోయి, అపార సంపదను చెల్లించేడు. శాంతి సమయంలో కూడా ఏనుగులు ప్రముఖ పాత్ర వహించేవి. ప్రతిరోజు ఒక ఖాసేస్ ఏనుగును రాజప్రాసాదం ముందుకు తీసుకు వచ్చేవారు. పెర్షియను నెల మొదటిరోజున పది ఏనుగులను ఒక చోట చేర్చేవారు. చక్రవర్తి తనకోసం ప్రత్యేకింపబడిన 101 ఏనుగుల సవారి నడిపేవాడు. మావటివాళ్ళు ఆశ్చర్యపడేలా చక్రవర్తి దంతాల మీద కాళ్ళునిలిపి ఏనుగును ఎక్కేవాడు. మొగలు చక్రవర్తుల విజయాలకు రహస్యం ఏనుగులు వహించిన పాత్రయే. మొగలు చరిత్ర చదవబడినంతకాలం జంతువులు, ముఖ్యంగా ఏనుగులు, వహించిన పాత్ర మరచిపోలేనిది.

—వ్యాసభాగం
'సైనిక సమాచార్'

## మానవ ప్రగతి

### కాస్మిక్ కిరణాలు

కాస్మిక్ కిరణాలను గురించి శాస్త్రవేత్తలు 1912 నుంచి పరిశోధనలు జరుపుతున్నారు. ఆస్ట్రియన్ పరిశోధకుడు విక్టర్ హెస్ ఆ ఏడాదిలో బెలూన్లలో డిటెక్టర్ పరికరాలను తీసుకొని భూమికి 4,800 మీటర్ల ఎత్తు వరకు ప్రయాణించాడు. భూమి నుంచి ఎక్కువ ఎత్తుకు వెళ్లినకొలదీ ఒక విచిత్రమైన తరహాలోవున్న రేడియేషన్ అధికమవుతున్నట్టు ఆయన కనుగొన్నాడు. ఈ రేడియేషన్‌ని కలిగిస్తున్న అంశం భూమి వాతావరణానికి వెలుపలి నుంచి వస్తున్నదని దీనివల్ల తేలింది. అమెరికా శాస్త్రవేత్త రాబర్ట్ మిల్లీకాన్ 1920లో ఈ అభిప్రాయాన్ని నిర్ధారించిన పిమ్మట – భూమి వాతావరణం వెలుపలి నుంచి వస్తున్న ఆ 'అజ్ఞాత' అంశానికి కాస్మిక్ కిరణాలు అని పేరు పెట్టారు. వాతావరణం వెలుపలి నుంచి భూమిపైకి దూసుకొచ్చే అత్యంత శక్తివంతమైన అణువుల సముదాయమే ఈ కాస్మిక్ కిరణాలు. మనిషి పార్టికిల్ యాక్సలరేటర్లలో సృష్టించగల అణువులకంటె ఇవి ఎంతో శక్తివంతంగా వుంటాయి. సుమారు 70 ఏళ్ల పరిశోధనల అనంతరం కూడా శాస్త్రవేత్తలు ఇప్పటికీ కాస్మిక్ కిరణాల 'పుట్టుక' గురించి, వాటికి అపారమైన శక్తినిస్తున్న అంశాల గురించి సమగ్రంగా తెలుసుకోలేక పోయారు. కాస్మిక్ కిరణాలలోని అణువులు సూపర్నోవా లనే భారీమృత నక్షత్రాల అవశేషాలని కొందరు ఊహించారు. అయితే ఇవి పల్సార్స్ అనే అత్యధిక సాంద్రత గల నక్షత్రాల పరిభ్రమణం లోంచి ఉద్భవిస్తూ వుండవచ్చునని మరి కొందరు ఖగోళ వైజ్ఞానికులు భావిస్తున్నారు. కాగా ఇప్పుడీ 'ఫ్లయ్ఐ' డిటెక్టర్ వల్ల, ఇంకా 1985లో అమెరికన్ స్పేస్‌షటిల్ 'ఛాలెంజర్' ద్వారా అంతరిక్షంలో ప్రవేశ పెట్టిన షికాగో ఎగ్ అనే మరొక డిటెక్టర్ పరికరం వల్ల కాస్మిక్ కిరణాల 'పుటుక' సంబంధించిన చిక్కుముడి వీడిపోతుందని ఆశిస్తున్నారు. .... ...... ......

....కాస్మిక్ కిరణాలను పరిశోధించే 'ఫ్లయ్ఐ' పరికరం అంతరిక్షంలోని కొన్ని వస్తువులనుంచి వెలువడే గామా కిరణాలను కూడా కనుగొనడం శాస్త్ర

వేత్తలకు ఆశ్చర్యం కలిగించింది. ఈ గామా కిరణాలను వెలువరించే వస్తువులలో అత్యధిక స్థాయిలో శక్తి క్రమం కొనసాగుతున్నదని వీటివల్ల వెల్లడవుతున్నది. 'షికాగో ఎగ్' గా పేరు పొందిన 1.5 టన్నుల బరువైన కాస్మిక్‌రే డిటెక్టర్‌ని, అమెరికన్ స్పేస్‌షటిల్ ద్వారా రోదసీలో ప్రవేశ పెట్టాలని 'నాసా' అనుకుంటున్నది.

## గంగానది

గంగానది కాలుష్యం, నదీతీరంలో ఉన్న కన్నాజ్, కాన్పూర్, అలహాబాద్, వారణాసి, పాట్నా, కలకత్తా నగరాలతో సహా సుమారు 200 పట్టణాలు, నగరాలకు పాకింది. 292 కోట్ల రూపాయలు విలువగలిగిన గంగా కార్యాచరణ స్కీము మొదటిదశలో ఈ క్లిష్టమైన జాతీయ కార్యక్రమాన్ని అమలు పరచగలరని ఆశిస్తున్నారు. ఈ స్కీము క్రింద ఇప్పటికే సుమారు 140 పథకాలు గుర్తింపబడ్డాయి. అంతేకాక ఉత్తరప్రదేశ్, పశ్చిమ బెంగాల్, బీహార్ రాష్ట్రాలలో 80 పథకాలను ఆమోదించడం జరిగింది. గంగా కార్యాచరణ స్కీములో అనేక సున్నితమైన అంశాలున్నాయి. ప్రస్తుతం ఉన్న మురికి కాలవలను ఆధునీకరించడం మరియు కొత్తవి నిర్మించడం మురికినీరు గంగానది లోనికి ప్రవహించకుండా అడ్డుగోడలను నిర్మించడం, మురికినీటి క్షాళన పథకాలను వినూత్నం చేయడం కొత్త వాటిని నిర్మించడం, గంగానది తీర ప్రాంతాలలో పరిసర పారిశుద్ధ పథకాలను కూడా చేపట్టడం; సగంకాలిన మృత దేహాలను జంతు కళేబరాలను గంగానదిలో పారవేసే దుస్సాంప్రదాయాన్ని అరికట్టడం లోహ పదార్థాలు, విషపూరిత రసాయనిక పదార్థాలు, తీవ్రమైన అమ్లక్షార గుణాలు కలిగిన పదార్థాలతో కూడిన పారిశ్రామిక విసర్జక పదార్థాల ప్రమాదం నివారించడం.... నదీ తీరం వెంబడే అక్కడక్కడ మురికినీటి ప్రక్షాళన యంత్రాలను ఏర్పాటు చేయడం ఈ పథకంలోని అతిముఖ్యాంశం. ఈ ప్రక్షాళన యంత్రం ఘన ద్రవ పదార్థాలను వేరుచేసి, ఘన పదార్థాలు 'డైజిస్టర్' ద్వారా పంపుతుంది. 'మీథేన్' వాయువు ఉత్పత్తి అవుతుంది. ఈ వాయువును విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయడానికి, వంట గాస్‌గాను ఉపయోగించవచ్చు. జీర్ణం చేయబడిన మిగిలిన ఘన పదార్థాలు ఎరువుగా ఉపయోగపడుతుంది. ద్రవ పదార్థాలను మరింత పరిశుభ్రంచేసి, చెరువుల లోను రిజర్వాయర్లలోను భద్రపరచి, నాచు మొక్కలు, చేపల పెంపకానికి ఉపయోగించవచ్చును. ఈ క్షాళన పద్ధతివలన ఇంధనం, ఎరువులు, నాచు, చేపలు లభిస్తాయి. గంగా కార్యాచరణ పథకం క్రింద కాన్పూర్‌లోని తోళ్ల పరిశ్రమ, డచ్‌వారి సాంకేతిక పరిజ్ఞానం సహాయంతో, ఒక ప్రత్యేకమైన క్షాళన యంత్రం సమకూర్చుకొంటుంది. రోజుకు 3 కోట్ల లీటర్ల మలిన పదార్థాలను శుభ్రపరుస్తుంది.

## గెలీలియో

జూపిటర్ (బృహస్పతి గ్రహం) పరిశోధనకు మానవ రహిత వ్యోమ నౌక 'గెలీలియో' ను 1989 అక్టో బరులో ప్రయోగించాలని అమెరికా నిర్ణయించింది. ఒక 'స్పేస్‌షటిల్' ద్వారా అంతరిక్షంలో ప్రవేశించే 'గెలీలియో' ఆ తర్వాత ఆరు సంవత్స రాలలో తన గమ్యమైన జూపిటర్‌ని పరిశోధించడం ద్వారా సౌరమండల వ్యవస్థ "పుట్టుక" కు సంబంధించిన సమాచారం శాస్త్రవేత్తలకు లభిస్తుందని భావిస్తున్నారు. జూపిటర్ లాంటి ఔటర్ ప్లానెట్స్‌లో - అవి ఏర్పడిన తర్వాత ఇంతవరకు ఏమాత్రం మార్పులు సంభవించలేదనేది పరి శోధకుల అభిప్రాయం. సూర్యుడికి దగ్గరగా వున్న భూమిలాంటి గ్రహాలు మాత్రం సూర్యుని వేడిమి ప్రభావంతో పెక్కు మార్పులను చవిచూశాయి. 1989 అక్టోబరులో ప్రయోగిం చిన అనంతరం 'గెలీలియో' వ్యోమ నౌక 1990 ఫిబ్రవరిలో శుక్రగ్రహం (వీనస్) మీదుగా ప్రయాణించి, సూర్యుడి కక్ష్యలో ప్రవేశించి, 1990 డిసెంబరులో భూమి సమీపం నుంచి వెళ్లి, తిరిగి మరొకసారి సూర్యుడిని చుట్టి, ఆపైన ఇంకొక పర్యాయం 1992 డిసెంబరులో భూమికి చేరువ నుంచి పయనించి, తుదకు 'జూపిటర్' దిశగా నడుస్తుంది. ఈ ప్రయాణంలో 'గెలీలియో' అస్టెరాయిడ్స్‌కి సంబం ధించిన సమాచారాన్ని సేకరిస్తుంది. ఒక వ్యోమనౌక ఇలా అస్టెరాయిడ్స్ సమీపించడం ఇదే మొదటి పర్యాయ మవుతుంది ; ఈ రోదసి నౌక 1991 అక్టోబర్‌లో 'గాస్ప్రా' కి, 1993 ఆగ స్టులో 'ఇడా' కి చేరువ నుంచి వెళ తుంది. 'గెలీలియో' లోని అత్యాధునిక మైన కెమెరా ఈ చిన్న చిన్న ఖగోళ వస్తువులకు సంబంధించిన సవివరమైన చిత్రాలను ప్రసారం చేస్తుందని భావిస్తు న్నారు. భూమికి సమీపం నుంచి రెండవసారి వెళ్లేటప్పుడు గెలీలియో, చంద్రుడి వెనుక వైపునకు సంబంధించి సవివరమైన సమాచారాన్ని అందిస్తుం దని కూడా ఆశిస్తున్నారు. చంద్రుడి వెనుక భాగాన్ని ఇంతవరకు ఎన్నడూ అత్యాధునిక 'సెన్సింగ్' పరికరాలతో పరిశీలించలేదు.

## సైనిక స్థావరాలు

34 దేశాల్లో పెంటగాన్‌కు 1600 సైనిక స్థావరాలున్నాయి. యూరప్‌లో 351,000 నుండి అమెరికా సైనికులు, పసిఫిక్, దూరప్రాంతంలో 130,000 మంది, లాటిన్ అమెరికాలో 22,000, మంది ప్రపంచంలోని యితర ప్రాంతా ల్లో 20,000 మందితో సహ విదేశాల్లోమొత్తం 523,000 మంది సైనికులున్నారు. పశ్చిమ యూరప్‌లో అమెరికాకు 270 భారీ సైనికస్థావరా లున్నాయి. జపాన్‌లో 120 సైనిక స్థావరాలు, దక్షిణ కొరియాలో 130 ఫిలిపైన్స్‌లో 30, ఆస్ట్రేలియాలో 15 కు పైగా వున్నాయి.

నాణ్యత మా తయారీ! ఖ్యాతి తెచ్చినది భారత ప్రజలు!!




# త్రివేణి

కోట్లాది ప్రజలు కోరుకునే
సుగంధ వక్కపొడి



త్రివేణి నట్ పౌడర్ మాన్యుఫాక్చరింగ్ కో.,
మచిలీపట్నం-521 001.

# కొత్త పుస్తకాలు

'అద్దం' - కవితలు. రచన : మాధవీ సనారా, ప్రచురణ : విస్ఫోటం - సాహితీ సమాఖ్య, ఖరగ్‌పూర్ - 721 304.... వెల : రు 2-00.

సారస్వత బావుటాని భుజాన వేసుకున్న విస్ఫోటం, సారస్వత పల్లకీ బోయీలతో, కవితల సంకలన ధనువుని ఎక్కుపెట్టి, కతల మైక్రోబాంబులు విసురుతుందట. ఆ లక్ష్య సాధన మాట ఎటున్నా, కరపత్రంలా కనిపించే ఈ 'అద్దం', కరదీపిక అని వొప్పుకోక తప్పదు .... 'మనిషికివ్యక్తిగతమైన ఆస్తి అతని వేదన ఒక్కటే; ఆనందం వెలుగైతే, ఆవేదన నీడ .. మన మనోక్షేత్రాన్ని తడిపే ఎదుటవారి కన్నీళ్లే ప్రపంచపు పచ్చదనాన్ని పెంచి, పువ్వులై నవ్వి సువాసనలై పరిమిళిస్తున్నాయి' - అంటున్నారు శియారామ్ శరణ్‌గుప్త.

"నీకూ నాకూ మధ్య-ఆనందాన్ని వృద్ధి పరిచింది - యితను - నిర్లక్ష్యంతో నీకూ నాకూ మధ్య - అనుమాన బీజాల్ని నాటిందీ - ఇతనే".... ఎవరు ? పోస్ట్‌మేన్. "పెద్దోళ్ల ఎయికండిషన్డ్ - హొటల్‌లో పేదో సిన్మా - శతదినోత్సవ వేడుకలు - హొటల్ పేరు సవేరా - సిన్మా పేరు ఆకలి రాజ్యం".... "ఎవరు నువ్వు ? - నేను దేవుణ్ని - ఏమిటి నీ గొప్ప ? - దశావతారుణ్ని - పోదూ. నేను నటుణ్ని - సహస్రావతారుణ్ని" - అంటున్నాడు కొత్త దేవుడు.... "నేను రూపాయిని - అంది పెద్ద స్టాంపు - అయితే ఏం ? నాకేసే - ముద్రేగా నీకూను - అంది పావలా స్టాంపు" - సోషలిజమ్‌ని అంత చక్కటి ఉపమానంతో చెబుతారు కవి ; ఈ సంకలనంలోని మినీ కవితలన్నీ చేయి తాకితే చుర్రుమనే నిప్పు కణికలు.

ప్రావ్‌ద (పరమసత్యం) రచన: అద్దంకి మన్నార్. ప్రచురణ : అద్దంకి శ్రీరామకుమార్, కానుమోలు - 521 106. కృష్ణాజిల్లా. వెల : రు 5-00.

'చైనా, పాకిస్తాన్‌లు భారతదేశంపై జరిపిన దురాక్రమణననూ, యుద్ధాలనూ ఖండించడమేగాక, సోవియట్ యూనియన్, ఉపఖండంలో శాంతిని నెలకొల్పడానికి బాగా దోహదం చేసింది' - అంటున్నారు. జర్మనీ నుంచి తిరిగివస్తున్నప్పుడు, నాలుగు రోజులు మాస్కోలో గడిపిన జివిజి కృష్ణమూర్తి, 'ముందు మాటగా ! నాలుగు సంవత్సరాలపాటు మాస్కో రేడియో

తెలుగు విభాగంలో పనిజేసిన అద్దంకి మన్నార్, ఈ పుస్తకాన్ని తన తలి దండ్రులకు (శింగరమ్మ – రామానుజాచార్యులు) అంకితమిచ్చారు. 99 ఏళ్ల తండ్రిగారు, కుమారుడు మాస్కో వెళ్తున్నప్పుడు, 'అబ్బాయ్, నీవు తిరిగి వచ్చే దాకా నేను వుంటానో, వుండనో- మంచి పేరే మనకు చివరికి మిగిలేది' - అని ఆశీర్వదించి పంపారట. అలాగే, అద్దంకి మన్నార్ ఉద్యోగ రీత్యా సోవియట్ పౌరులతో కలిసి పోతూ, తన వేషభాషలలోను, జీవన విధానంలోను భారతీయ సంస్కృతిని నిలబెడుతూ, తన వ్యక్తిత్వాన్ని కాపాడుకున్నారు.

సోవియట్ యూనియన్‌లో సూర్య దేవాలయం ఉంది. క్రైస్తవుల చర్చి మందిరాలు ఉన్నాయి. ముస్లిమ్‌ల మసీదులు ఉన్నాయి. మత ప్రచారం చట్టరీత్యా నిషేధం గాని, ఎవరికిష్టమైన మతం వారు అవలంబించవచ్చు. దేశం మొత్తాన్ని స్త్రీలే నడుపుతున్నట్టు కనిపిస్తుందట. మన దేశంలో ప్రతి ఊళ్లోనూ గుడి వున్నట్టు, అక్కడ బడి ఉంటుంది. నిర్బంధ విద్యావిధానం దేశమంతటా ఉంది. ఉన్నత విద్యావకాశానికి, విద్యార్థిలోని తెలివితేటలు ప్రధానంగాని, మాతా పితరుల పలుకుబడి చిల్లి గవ్వ చేయదు. ఒక స్కూలులో వారికి మార్కులు వేసేది, మరొక స్కూలులోని టీచర్లు. ఎగ్జామ్స్‌అంటే గుండెదడ పుట్టించేవిగా ఉండవు - సబ్జక్ట్‌ని విద్యార్థి జీర్ణించుకోవడం ముఖ్యం.

సోవియట్ యూనియన్‌లో పద్నాలుగు వందల వృత్తులు వున్నాయంటే నిజమా అనిపిస్తుంది. వృత్తివిద్యలు నేర్పేందుకు ఆరువేల ఎనిమిది వందల పాఠశాలలు వున్నాయట. నిరుద్యోగమనేది మచ్చుకి కూడా కానరాదు. డాక్టర్లు ఫీజు పుచ్చుకోరు - ప్రభుత్వమే వారికి వేతన మిస్తుంది. డాక్టరు మనింటికి వస్తాడు - అవసరమైతేనే ఆస్పత్రిలో చేరుస్తారు. ఔషధ సేవన్ను కంటె వ్యాధినిరోధం పట్లవారు ఎక్కువ శ్రద్ధ చూబుతారు. కాలులో గుచ్చుకున్న ముల్లు తీయడం నుంచి గుండెకాయ మార్పిడి దాకా సమస్తం ఫ్రీ.

కుటుంబంలోని మనుషుల సంఖ్యని బట్టి యిల్లు కేటాయిస్తారు - ఇంటి అద్దె నెలసరి సంపాదనలో నాలుగైదు శాతానికి మించదు. ఒకొక్క మల్టీ స్టోరీడ్ బిల్డింగ్‌లో వందేసి కాపురాలు వుంటాయి. - ఇరవైనాలుగు గంటలూ వేన్నీళ్లూ చన్నీళ్లూ ప్రతివాటాలోనూ ఉంటాయి - టెలిఫోనూ, సెంట్రల్ హీటింగ్ యిత్యాదులతోబాటు! పి.వి నరసింహారావుగారు, నీలం సంజీవ రెడ్డిగారు సోవియట్ యూనియన్‌కు తను అక్కడ ఉద్యోగిగా ఉన్నరోజులలో రావడం, మాస్కో రేడియో నుంచి ఆ ప్రముఖులు తెలుగులో ప్రసంగించడం, తన జీవితంలో మరుపురాని అనుభూతిగా భావిస్తున్నారు అద్దంకి మన్నార్.

— క్షీరసాగరమ్



కవిత

# మా 'నవజీవన' యాత్ర

## డా॥ బెజవాడ గోపాలరెడ్డి

'87 ఆగస్టులో స్వరాజ్యోదయం జరిగి
40 సంవత్సరాల పూర్తి
అదే మాసంలో నా వయస్సు
80 సంవత్సరాల పూర్తి
జులై మాసానికి
నా మద్రాసు మంత్రిత్వానికి
50 సంవత్సరాల పూర్తి
మే మాసముతో, నా సొంత
రచనల ప్రారంభమునకు
10 సంవత్సరాల పూర్తి
వీని శుభస్మరణ ఫల స్వరూపము
గాంధీజీ పుట్టిన రోజు
పుట్టిన స్థలాన్ని దర్శింప సంకల్పం
సతీసమేతముగా బయలుదేరాము
హైదరాబాదు స్నేహితులిద్దరు
కలిశారు - మా తీర్థయాత్రలో
సుఖముగా, ఆనందదాయకముగా
జరిగింది మా 'నవజీవన' యాత్ర

నా విద్యార్థిదశలో బందరు
జాతీయ కళాశాలలో
ఒక సంవత్సరం, నేను చొక్కావేయ
లేదు. దిగుమతి యగుచుండిన
చక్కెరను వాడలేదు
ఆ దినాల పరిత్యజనల వర్ధంతిగా
పోరుబందరులో
నేను చొక్కా వేయలేదు
చక్కెర వాడలేదు

అహమ్మదాబాదులో తొలుత,
సబర్మతీ ఆశ్రమాన్ని దర్శించాము
సబర్మతీనదీతీరాన, పునీతస్థలాన
సంధ్యాప్రార్థనల స్మరించాము
గాంధీ నివాసమందిరమును
రాట్నము త్రిప్పుచుండిన గదులను
దర్శించాము
1930 మార్చి 12 న
ఉప్పు సత్యాగ్రహమునకై
సత్యాగ్రహ వీరయోధులతో
దండి - సముద్రయాత్రను స్మరించాము
వేలాది ప్రజ తను గాచుచుండ
పాదయాత్రలో, బయలుదేరిన గాంధీ
అయోధ్యను వీడు శ్రీరామచంద్రునివలె
స్మరణవీధులలో శోభిల్లినాడు

4

వారు వినియోగించిన వస్తువుల
ప్రదర్శనశాలను దర్శించాము

ఆ స్మారికలు, చిత్తరువులు
త్యాగగరిమ రూపుగొన్న వాస్తవాలు
చరిత్రకు వదలిన, పునీత అవశేషాలు
భవిష్యత్తుకు ఆదర్శపదచిహ్నాలు

5

అట్టి మహనీయుడు, త్యాగశీలి పుట్టి
ఆసేతుహిమాచలము
ఉత్తేజపరచాడని
రానున్నతరాలు, శతాబ్దాలు
'విశ్వసింప వెనుకాడుతాయి'
అన్నాడు - అగ్రసైన్టిస్టు 'ఐన్‌స్టీన్'
గాంధీజీని దర్శించి

6

పురాణాలు ఊహించని
ఇతిహాసాలు తలచని
అహింసామూర్తి, త్యాగనిరతుడు
రాజకీయ ప్రజానాయకుడు
ఊహాతీతమైన మహామానవుడు

పోర్‌బందర్, గాంధీజన్మనికేతనం
సబర్మతీ ఆశ్రమం
పూనా యరవాడ జైలు
వార్ధా సమీపపు సేవాగ్రామము
అసువులుబాసిన బిర్లా భవనము
దహనము చేసిన, రాజఘాటు
వారి జీవితముతో
ముడివడిన తీర్థధామాలు

8

ప్రారంభించిన ఉద్యమాలు
రాట్న చిహ్నముగా
గ్రామీణ పరిశ్రమలు
హరిజనోద్ధరణ
థక్కరుబాపా వంటి
నాయకుల ప్రేరణక్రింద
వన్య ప్రాంతాల వికాసము
అక్రమ శాసనాల ఉల్లంఘన
అహింసా సత్యాలపై నిల్పిన
సత్యాగ్రహ ఉద్యమాలు
హిందుస్తానీ భాషాప్రచారము
సమాజాన్ని ఉత్తేజపరచేవే
నూతన చైతన్యాన్ని పల్లవింపజేసేవే
శతాబ్దాలు స్మరించే
నిర్మాణ కార్యక్రమాలే

9

గుజరాతు 'గిర్' అడవులలో
సజీవవన్య సింహాలను చూచాము
ఫొటోగ్రాఫులు తీశాము.
పంజాబు సింగులకన్నా
గుజరాతు సింహాలు –
అహింసాయుతముగ కాన్పించాయి
జైనమత ప్రభావమా ?
గాంధీ తత్వమా ?

10

గుజరాతు పది దినాలతీర్థ యాత్రలో
వీక్షించిన దృశ్యాలను
పొందిన అనుభూతులను
నెమరు వేసుకొంటుంటేనే
ఆనందాలు, ఆహ్లాదాలు
మదిలో పొంగుచు ఉన్నాయి
రమ్యంగా - మర్యాదగా
జరిగిన సంతృప్తియాత్ర

11

ఒక వైపు గాంధీ స్మారికలు
'కీర్తి' మందిరాలు
ఇంకొక వైపున,
కృష్ణ కళ్యాణమండపం
పాలించిన ద్వారకా నగరము
వేటగాని అంబునకు గురియై
వేటగాడు విలపించుచుండ
నిర్యాణము చెందిన కృష్ణునితో
సోమనాథ మందిరము
గుజరాతు కళాశిల్పముతో
నిర్మాణమగుచున్నాయి

12

సౌరాష్ట్రములో
చిన్నవి పెద్దవి స్వదేశ సంస్థానాలు
వందలపైబడి ఉండినాయి
భారతదేశంలో విలీన పరచిన
సర్దార్ పటేల్ పెద్దవిగ్రహాన్ని
సోమనాథ మందిర సమ్ముఖమున
స్థాపించినారు
చారిత్రక యథార్థాలను
చిత్రించే విజయ స్తంభమది
రాజకోట - జూనాఘడ్
జాంనగరు పట్టణాలనూ చూచాము.

(రామన్న కావ్యంలోని 'కళికలు')

# మాలతీ చందూర్

## నవలలు

| | |
|---|---|
| వైశాఖి | 16 – 50 |
| కాంచనమృగం | 16 – 50 |
| భూమి పుత్రి | 16 – 00 |
| మధుర స్మృతులు | 14 – 00 |
| ఓ మనిషి కథ | 16 – 00 |
| ఏమిటీ జీవితాలు | 12 – 00 |
| మనసులోని మనసు | 25 – 00 |
| ఆలోచించు | 9 – 00 |
| రాగరక్తిమ | 18 – 00 |
| మేఘాల మేలిముసుగు | 16 – 00 |
| కలల వెలుగు | 15 – 00 |
| బ్రతక నేర్చిన జాణ | 14 – 00 |
| జయలక్ష్మి | 20 – 00 |
| కృష్ణవేణి | 20 – 00 |
| ఏది గమ్యం, ఏది మార్గం | 15 – 00 |
| ఎన్ని మెట్లెక్కినా.... | 18 – 00 |
| సద్యోగం | 15 – 00 |
| లావణ్య | 14 – 00 |

## ఇవిగాక

| | |
|---|---|
| వంటలు – పిండివంటలు | 35 – 00 |
| ప్రశ్నలు – జవాబులు | 15 – 00 |
| జాబులు – జవాబులు | 13 – 00 |
| అల్లికలు – కుట్లు | 30 – 00 |
| అందాలు – అలంకారాలు | 15 – 00 |
| మహిళలకు మధురజీవనం | 7 – 50 |
| దాంపత్య జీవితం | 12 – 50 |

20/– రూ॥ పైబడి పుస్తకములు తెప్పించుకొనేవారు. ముందుగా ఆ పుస్తకాలధరకు 2 రూ॥ తగ్గించి M. O. పంపితే, 2 రూ॥లకు మాత్రమే V. P.P. పంపుతాము. అందువలన మీకు అసలు ధరకే పుస్తకాలు అందుతవి.

## క్వాలిటీ పబ్లిషర్స్

రామమందిరం వీధి – విజయవాడ-2.

సీరియల్

# భ్రమర గీతం

## అచ్యుతవల్లి

**గడిచిన కథ:** రామజోగి పంతులు మనుమరాలు, తన ఉన్నతికి కారకురాలు అయిన భ్రమర, బంధువులందరికీ దూరంగా, ఒంటరిగా, ఉత్తరాదిని ఒక పట్నంలో ఉంటూ, తనకి రమ్మని టెలిగ్రామ్ యిస్తే, ఏదోవిధంగా ఆమెని ఒప్పించి స్వంత ఊరు తీసుకు వెళ్లవచ్చుననే ఆశతో వచ్చాడు చలపతిరావు. ఆమె వినదు సరిగదా పక్కింటి బీదబ్బాయి బాబూరావుని చలపతి వెంట తమ ఊరు పంపుతుంది.... ఇక చదవండి

భ్రమర కేసి చూసాడు. అవిడ కళ్లు తడిగా మెరిసాయి. తనమీద ఆత్మీయతో, బాబూరావు మీది అభిమానమో అర్థం కాలేదు చలపతికి.

బాబురావుని తేలిగ్గానే తమలో కలుపుకుంది మేరిలిన్. సుమనకి బాబూరావుని చూస్తే ఇటువంటి తమ్ముడు వుంటే ఎంత బాగుంటుంది?- అన్పించింది. రెండు మూడు నెలలు గడిచేసరికి బాబూరావు తాతగారికి, మేరిలిన్‌కి, సుమన్‌కి కూడా ఆప్తుడయిపోయాడు.

లక్ష్మణరావుకి కొడుకు మనస్తత్వం ఏమ్మిటో అంతు బట్టడం లేదు. వసుధ పెళ్ళి అయ్యేదాకా చెల్లెలు పెళ్ళి కోసరం తను స్వయంగా కష్టపడాలి కనుక పెళ్ళి ప్రసక్తి తేవటం లేదు - అనుకొన్నాడు. వసుధకి పెళ్ళి చేసాడు. పిల్లల తల్లి అయింది. జోగిపంతులు గారు మనుమరాళ్ళని ఎవరినయినా ఇస్తాడేమో అనుకొన్నాడు. సుమనకి కూడా ఒక సంబంధము కుదిర్చి మహా వైభవంగా పెళ్ళి చేశారు. చలపతి బిజినెస్‌ని బాగా అభివృద్ధి చేసాడు. అనవసర విషయంలో జోక్యం చేసుకోడు. తీరిక వున్నప్పుడల్లా జోగిపంతులు మేడలోకి వెళ్ళి కూర్చుంటూ వుంటాడు. కంపెనీ అభివృద్ధిని చూసి అఖిల్, అనిల్ కూడా మెచ్చుకుంటూంటారు. అన్ని విధాలా వాళ్ళల్లో ఒక మనిషి అయిపోయాడు చలపతి. రోజులు వారాలయ్యాయి. వారాలు నెలలు అయ్యాయి. నెలలు సంవత్సరాలుఅయ్యాయి. గోపాల్రావు చలపతిని బాగా పరిశీలించాడు. డబ్బు క్లుప్తంగా వాడతాడు. లేనిపోని దర్జాలు పెరగలేదు. పెద్దవాళ్ళంటే గౌరవం వుంది. విద్య వున్న చోట వినయం వుంటే విద్యాదేవి సంతోషిస్తుంది. లేకపోతే ఇలాంటి హీనుడికి ఎల్లా వశమయ్యానా

అని కంట తడి పెడ్తుంది. లేని ఇంటి లోంచి చలపతి ఇంత ఉన్నత స్థితికి ఎదిగినా తన స్వయం శక్తి మీద ఇంతటి ఉన్నతిని సాధించినా అతనికి వినయం వివేకమూ ఏ మాత్రమూ తగ్గలేదు. గోపాల్రావు అయిదారు సంవత్సరాలు ప్రతిక్షణం చలపతిని పరిశీలించాడు. భ్రమర కోసం వెళ్ళి నపుడుఆపిల్లని ప్రేమించుతున్నాడేమో, వాళ్ళిద్దరి పెళ్ళికి లక్ష్మణరావుకి మేరిలిన్‌కి అభ్యంతరం వుండదు కదా అనుకొన్నాడు. కాని మళ్ళీ భ్రమర ఇతనిని రమ్మనలేదు, ఇతను తనకై తాను వెళ్ళలేదు. అది గ్రహించాడు గోపాల్రావు.

గోపాల్రావుకి ఒకే ఒక చెల్లెలు వుంది. వాళ్ళ అమ్మాయి కమల. తల్లి చనిపోయేనాటికే ఆ పిల్ల బి.కాం ప్యాసు అయింది. చామన ఛాయలో కనుముక్కు తీరుగా వుంటుంది. కమ లకి పాతికవేలు కట్నం ఇచ్చి అయినా పెళ్ళి చేయగల స్తోమత వుంది గోపా ల్రావుకి. కాని భార్య ఒప్పుకోదు. ఆమె డబ్బుతో గోపాల్రావు బిజినెస్ ప్రారం భించాడు. లక్షలు లక్షలు గడించాడు. కాని ఒక్కగాని ఒక్క చెల్లెలుని కష్ట సమయంలో ఆదుకుందుకు అర్హతని గడించలేకపోయాడు. చెల్లెలు,కమలని తన చేతుల్లో పెట్టింది.

"అణకువయిన పిల్ల, అన్నయ్యా! నీ నీడన వుండనియ్యి చాలు. ఏదో చిన్నపాటి ఉద్యోగం చూపించు-తన పొట్ట తాను పోషించుకుంటుంది." ఆ అమ్మాయిని, విచిత్రమయిన వస్తువును చూసినట్లు చూసారు ఇంట్లో! కమల సూక్ష్మగ్రాహి! మేనమామ మాట చెల్లదని తెలుసుకుంది. అసలే మృదు స్వభావము, తల్లీ తండ్రీ లేకపోవ టంతో ఇంకా ఒదిగి ఒదిగి వుండేది. చదువుకునే రోజుల్లో కూడా, తన చదువేమో తానేమో, ఇతర విషయాల పట్ల ఆసక్తి చూపించేది కాదు. ఆటలు పాటలు ఆమెకి రావు. కమలని ఇంటి లోనికి తీసుకువచ్చినందులకు భార్యా పిల్లలు ముఖాలు మాడ్చుకున్నారు.

"ఆ పిల్లకి మీరేం చేయాలి? తన పనులు తాను చేసుకుంటుంది. వంటా మెతో సహా నలుగురు నౌకర్లు వున్నారు. ఆ పిల్లకి పట్టెడు అన్నం వుండదా? అయినా దానికి ఒక ఉద్యోగం దొరికింది. కావాలంటే నూరో నూట యాభయ్యో దాని తిండి, ఖర్చుకి తీసుకోండి" అన్నాడు గోపా ల్రావు. భార్యకి కోపం వచ్చింది.

"నేను డబ్బుకి చూసుకుంటున్నాను అనుకుంటున్నారా? ఇల్లాంటి బీద బిక్కీవాళ్ళు ఇల్లంతా నిండిపోతే మన పిల్లల ఇమేజ్ దెబ్బతింటుందని భయం అంతే! పెట్టలేక కాదు. అష్టరాల్ మన జిన్నీకి అయ్యే ఖర్చు కూడా అవదు" అంది ఆవిడ. జిన్ని ఆమె పెంపుడు కుక్క.

"అయితే ఫరవాలేదు. కమల మధ్య తరగతి బీద కుటుంబపు పిల్ల. నీ అరిస్టోక్రటిక్ అలవాట్లు అన్నీ నేర్పి - మంచి కుటుంబంలో పిల్ల అయి పోతుంది. ఇప్పుడు దానికి తల్లీ తండ్రీ లేరు. ఇంక మన పిల్లే కనక గోవర్ధని

గారి మేనకోడలు ఎల్లాగ వుండాలో ట్రయినింగ్ ఇవ్వు," అన్నాడు. ఆర్. జి. పి. కంపెనీలోనే క్లర్కుగా ఉద్యోగం వేయించాడు. కమల బుద్ధిగా ఉద్యోగం చేసుకుంటోంది. కాని ఆ పిల్ల రోజులు నిస్సారంగా గడుస్తున్నట్లు బాధగా వుండేది గోపాల్రావుకి. చలపతిని చూస్తే ఒక అయిడియా వచ్చింది. వయస్సు తేడా వుంటే వుంది కాని యోగ్యుడు. ఇతనికి కమలని చేస్తే బాగుంటుంది అనుకున్నాడు. భ్రమరకీ చలపతికీ ఉన్నది ఒక స్నేహమే - అనుకున్నాడు. ఆవిడ వృత్తి స్నేహితురాలు మాత్రమే! అందులో చిన్నప్పటి నుండి వాళ్ళ ఉప్పు తిని, బ్రతికి బట్ట గట్టిన వాళ్ళు కనుక ఆ కుటుంబానికి కృతజ్ఞులై వుండటం తప్పనిసరి. భ్రమరతో స్నేహం వుందన్న కారణంగా తను కమలను ఇచ్చి పెళ్ళి చేయటానికి వెనుకాడనక్కర లేదు. కమల తన కళ్ళ ముందర వుంటుంది. చలపతి తన చేతి నుండి జారిపోక మునుపే ఈ మాట నిశ్చయం చేసేసుకోవాలి - అనుకొన్నాడు.

పెద్ద పడవలాంటి కారులో తమ ఇంటికి వచ్చిన గోపాల్రావుని చూసి లక్ష్మణరావు కంగారు పడిపోయాడు.

"ఏమిటి తమరిలా వచ్చారు? కాకి చేత కబురంపితే తమ గుమ్మం ముందు వ్రాలను?" అన్నాడు లక్ష్మణరావు. అనసూయ నిమ్మరసం తెచ్చి ఇచ్చింది.

"నేను రావటం, నా మాట నీవు కాదనవనే ధైర్యంతో వచ్చాను లక్ష్మణా," అన్నాడు ఆప్యాయంగా.

"అదేమన్నమాట - మీరు ఒక మాట చెప్పటం, నేను కాదనటమూనా!"

"అదే మన చలపతి విషయం?"

బిగుసుకు పోయాడు లక్ష్మణరావు. చలపతి కింత ఉజ్వల భవిష్యత్తు కల్పించిందీయనే! జోగిపంతులుగారి కంపెనీ వ్యవహారాలు సమర్థవంతంగా నిర్వహించు తున్నాడు. చలపతికి ఏమీ నష్టం రాకుండా చూస్తున్నారు - ఆయన కేమి చేసివుంటాడు చలపతి ఇంత పెద్ద మనిషి తమ ఇంటికి రావటానికి చలపతి ఏమీ చేసివుంటాడో? బుర్ర బద్దలైపోతున్నా అర్థం కావట్లేదు లక్ష్మణరావుకి. అనసూయ బిగురాకులా వణికిపోయింది.

"బలే, మీరేమిటి అల్లా అయిపోయారు?" అన్నాడు నవ్వుతూ. ఆయన నవ్వు ముఖం చూసాక కొంచెం తెప్పరిల్లాడు.

"ఏమిటి?" అన్నాడు లక్ష్మణరావు తనూ నవ్వుతూనే.

"చలపతికి మీరు పెళ్ళి చేయరా అని అడగటానికి వచ్చాను" - గంభీరంగా అన్నాడు. లక్ష్మణరావు మళ్ళీ సందిగ్ధంలో పడ్డాడు. సరాసరి సంభాషణలోకి దిగాడు పెద్దమనిషి - ఎల్లాగ? చలపతీ ఈయనా మాట్లాడుకున్నారా?

"మాకూ చేసేయాలనే వుంది. వాళ్ళూ వీళ్ళూ అడిగి లేదనిపించుకుంటున్నారు. చలపతిని మీరు అడి

గారా ?" అన్నాడు. చలపతి ఆయన ముందు 'యస్స్' అని వుంటాడా ? వాళ్ళిద్దరూ ఒకటయితే మళ్ళీ తన నెందుకు అడగటం ?

"అమ్మమ్మ ఎంత మాట - మీ అనుమతి లేనిదె అతనిని అడుగుతానా? ఇది పెద్దవాళ్ళ విషయం - మనం అన్నీ మాట్లాడుకున్నాక అతనికి పిల్ల విషయం వదిలేద్దాము"

"మీకు తెలియని విషయాలే మున్నాయి - మా పరిస్థితులన్నీ మీకు తెలుసును."

"అందుకనే నేను బాగా ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చాను. మా మేన కోడలున్నది. బి.కాం. ప్యాసయింది, అణుకువ అయిన పిల్ల. ఆర్. జె. పి. లోనే క్లర్క్ ఉద్యోగం వేయించాను. అది తప్ప నేను ఇవ్వగల కానుకలు ఏమీలేవు. మీరిష్టపడితే మా మేన కోడల్ని మీ ఇంటికి తీసుకువస్తాను. చూద్దురు గాని !" అన్నాడు. లక్ష్మణ రావు గొంతు ఉండచుట్టుకు పోయింది.

ఏమిటి ఇల్లా చుట్టబెట్టాడు ? దిక్కు మొక్కులేని పిల్లని అంటగట్టుతాడా ? కాదంటే ఉద్యోగం చూపించినందుకు కృతజ్ఞత లేనట్లు అవుతుంది. అవునన టానికి ఒక అత్తిల్లు పుట్టిల్లూ అంటూ లేకుండా అనాధ పిల్లని చేసుకుని అచ్చట ముచ్చటాలేని సంసారం ఈడ్చుకోవలసి వస్తుంది. మేరిలిన్ పిల్ల అయితే వ్రతం చెడినా ఫలందక్కి నట్లు, లక్షల ఆస్తి అయినా దక్కు తుంది - అందుకనే ఎంతో ప్రయత్నం మీద మామూలుగా వుండటానికి ప్రయత్నించుతూ "నా ఇష్టం ఏముం టుంది? చలపతి ఇష్టమే మా ఇష్టము. వాడని అడిగి చూడండి" అన్నాడు. లక్ష్మణరావు హాఫ్ హార్టెడ్‌గా అన్నట్లు కనిపెట్టేసాడు గోపాల్రావు.

"లక్ష్మణరావూ, నీకా ఒక్కడే కొడుకు. పెద్దకాలంలో నిన్నూ నీ ఇల్లా లినీ కన్నకూతుర్లా కనిపెట్టికుని వుం డాలి-నలుగురు కొడుకులు వుంటే, ఒక కొడుకు కాకపోతే ఒక కొడుకన్నా కని పెట్టి చూస్తాడనుకోవచ్చును. ఒక్క కొడుకు - పెళ్ళి చేయబోయే ముందు కోడలు సెలక్షన్‌లో జాగ్రత్తగా వుం డాలి. మా కమలకు పేదరికం, డబ్బు విలువ తెలుసును. నీకు లక్షరూపాయల ఆస్తితో వచ్చే కోడలు, నీ భార్య, నీ కూతుళ్ళ వెంట కూరలు తరుగుతూ, స్నానం పానం అమర్చుతూ కూర్చోదు. అతనిని కూర్చోనివ్వదు. ఈ స్థితిలో వున్నారు కనుక మేము పాతిక వేలు ఇస్తాం, ముప్ఫయ్‌వేలు ఇస్తాం అంటూ చుట్టాలు పక్కాలు నిన్ను వూపిరి సలప నివ్వరు. డబ్బు శాశ్వతం కాదు ఎవరు పోగు చేసుకుంటే వాళ్ళ వద్దే చేరుతుంది. మా కమలకు ఉద్యోగం వుంది. మీకు ఎన్ని వేల రూపా యలు పోగు చేసుకోవాలంటే అన్ని వేల రూపాయలు పోగయ్యే దాకా ఉద్యోగం చేయించుకోండి - మీరు మొహమాట పడక్కరలేదు. ఏమమ్మా నేను చెప్పింది సబబుగా లేదా ?" అన్నాడు. అనసూయ నవ్వింది. అన సూయకి మేరిలిన్ పిల్లలు అందగత్తెలు.

డబ్బుగలవాళ్ళు అయినా మనస్సులో వర్ణ సంకరం అనే కించ వుంటూనే వుంది. ఈ పిల్ల తనకి కోడలు అయితే గోపాల్రావు గారు చెప్పినట్లు తన ఇల్లు శాంతి నిలయంలా వుంటుంది. ఇద్దరు కూతుళ్ళకీ తాము లేకపోయినా పుట్టింటికి రావటానికి ఒక అర్హత వుంటుంది. ఆడపడుచులు పండగలకి, పబ్బాలకి ఇంటికి వస్తూ పోతూ వుంటేనే కళ - ఈ పిల్ల తమలో తేలిగ్గా కలిసిపోతుంది, అనసూయ ముఖంలోని సంతోషం స్పష్టంగా గమనించాడు గోపాల్రావు. ఆడవాళ్ళకి ఇష్టం అయితేనే సంబంధం కలుపుకోవాలి ఎక్కడయినా, అనుకున్నాడు.

"ఏమిటో వాడి పెళ్ళి మాట అనటానికి జంకుగా వుంది" అన్నాడు లక్ష్మణరావు.

"ఏం ?" అంది అనసూయ.

"వాడి మీద అందరి కళ్ళూ వున్నాయి. వాడి మనస్సులో ఏం వుందో చెప్పటంలేదు. చివరికీ గోపాల్రావు గారు కూడా వాడిమీద ఆశ పడుతున్నారు."

"ఆయన అందరి అవసరాలు గమనించే విజ్ఞాత గల వ్యక్తి. ఎన్నాళ్ళని వాడికి సుఖం చూడకుండా సంపాదన తింటూ కూర్చోవటం ? విమల కూడా గజ్జల గుర్రంలా ఎదిగి కూర్చుంది. దానికి సంబంధం చూడరా, అని ఏమని చెప్పటం? వాడిని కదిపి చూడండి" అంది అనసూయ.

పూర్వంలా కాదు, ఇంట్లో వాతావరణం స్తంభీభూతంగా వుంది. తల్లి తండ్రి 'చలపాయి' అంటూ అధికార యుతంగా పిలిచేవారు. ఇప్పుడు పై ఆఫీసరు ముందు గుమస్తాల్లా వుంటున్నారు. విమల కూడా గౌరవనీయమైన వ్యక్తిని చూసినట్లు తప్పుకు తప్పుకు తిరుగుతూంది. కాని చిన్నప్పటిల్లా "అన్నయ్యా అన్నయ్యా" అంటూ చుట్టుకుని చుట్టుకుని తిరగదు. తనని కని పెంచిన తల్లి తండ్రులకి తోడు నీడలకి మధ్య ఇంత దూరం ఎల్లా పెరిగింది ? చిన్నప్పుడు అల్లరిచేస్తే రెండు మొట్టికాయలు మొట్టి, చదువు కుందుకు బద్ధకిస్తే తిట్టి కసిరి పెంచిన తల్లి తండ్రులు, కొడుకుల ఆర్జన వచ్చేసరికి జీహుజూరు అనే తత్వంలోనికి మారిపోతారు ఏమిటి ? ఏమంటే కొడుకుకు తమ మీద వున్న ప్రేమ, గౌరవం తరగిపోతాయేమో అని భయపడుతూ, ప్రతిక్షణం తమ చివరి దశ కొడుకు చేతుల్లో వెళ్ళమారదేమో. అన్న ఆందోళనతో సతమతమయిపోతారేమిటి ? తమ కున్న ఆఖరు పైసా కూడా కొడుకుల భవిష్యత్తు కోసం ఖర్చుపెట్టి, వాళ్ళని పైకి తీసుకువచ్చి, చివరకి ఆ కొడుకుల ముందు జోలె పట్టుకుని ప్రేమ, దయాభిక్ష ఆర్థించటం ఎంత నికృష్టం. అదే తల్లి తండ్రులు బోలెడు ఆస్తిపాస్తులు సంపాదించి పీట క్రింద పెట్టుకుని కూర్చుంటే, ఆ కొడుకులే తల్లీ తండ్రి చుట్టూ డబ్బా వాయించుకుంటూ తిరుగుతారు. ఒక వయస్సు వచ్చేసరికి మధ్య తరగతి సంసారాల్లో ఏదో కృత్రిమత్వం వద్దన్నా చోటుచేసుకుం

టుంది. వానవచ్చే ముందు ఉడక 'త పోసినట్టు వుంటుంది వాతావర ం. చలపతికి తల్లితండ్రుల మీద ఒ'లి వేసింది. వీళ్ళ్ి ఏమీ కష్టపెట్ట కూడదు. తన తల్లి తండ్రులు ఎర్ధ నులే కావచ్చును. కాని వాళ్ళ శక్తి యుక్తులన్నీ తనకోసమే కరిగించారు. వాళ్ళు ఏది చేయమంటే అది చెయ్యాలి - అనుకున్నాడు చలపతి. ఆఫీసులో ఏదో అర్జంటు పని చూసుకుంటున్నాడు చలపతి. టేబుల్ మీద ఫోన్ మ్రోగింది.

"హలో!" అన్నాడు.

"నేను కమలని" - ఆగాడు. పేరు విన్నట్లు మనిషిని చూసినట్లు గుర్తు . ఎక్కడ చూసాడు ఆమెని ? ఆ పే విన్నాడు - ఎక్కడ విన్నా పేరుని ?

"మీరు....

"గోపాలరావుగారి నీస్‌ని...." చాలా మృదువుగా సరళంగా వుం గొంతు.

"ఐ. సీ! గుర్తు వచ్చింది. డిస్పాచ్ సెక్షన్ కదూ! వాట్ కెన్ ఐ డూ?" - ఆ అమ్మాయిని ఇంతవరకు దగ్గిరగా చూడలేదు. ఆ అమ్మాయి తనకి ఫోన్ చేసేంతటి చనువు స్నేహం లేవు. అఫీషియల్‌గా ఆ అమ్మాయి తనకీ కలుసుకోవలసిన అవసరం రానేరాదు.

"మామయ్య గారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారు" - కొంచెం తొట్ర పాటు కంగారు గొంతుతో!

"ఎక్కడికి ?" ఆశ్చర్యంగా వుం చలపతికి.

"మామయ్యగారింటికి !"

"ఐ. సీ!" - ఫోన్ పెట్టేసాడు. అరగంటలో నాలుగయిదు అవసర మైన ఫైళ్ళు చూసినట్టు చూసి, 'రూమ్' తాళం వేయబోతూ 'బాత్‌రూమ్' లోనికి వెళ్ళాడు. వాష్ బేసిన్ వద్ద ముఖం కడుగుకుంటూ ఎదురుగా వున్న అద్దంలోనికి ముఖం చూసు కున్నాడు. తెల్లగా కోలగా పలచటి ముఖం! చెంపలు రోజూ షేవ్ చేసు కోవటం వల్ల లేతాకు పచ్చగా నీడలు పరిచినట్లు వున్నాయి. ఇంకా కొంచెం వళ్ళు వస్తే మెజిస్టిక్ పర్సనాలిటీ అవును ! ఎంచేతో తనకి వళ్ళురాదు. నలభయి వస్తున్నాయి. ఈ పొడుగుకి తగ్గ వళ్ళుంటె ఇంకా కొంచెం రంగులో మెరుపు వస్తుంది; ఎల్లా వుంటేనేం ? ప్చ్ - అనుకున్నాడు. అనుకోకుండా భ్రమర గుర్తుకు వచ్చింది. తన కళ్ళ లో మెరుపుల్లా వారదేసి కళ్ళు - తమాషా నవ్వు, చేతిలో పట్టుదొరకని నవ్వు! గుండెల్లో గుచ్చే సూది మొనలు. ఛఛ. ఇంకా ఎందుకామెని తలుచుకోవటం ? తానెన్నిసార్లు అవ కాశాలు ఇచ్చాడు? హాయిగా కుదు రుగా వుండమని ఎంత బ్రతిమి లాడాడు? జీవితాన్ని అంత కేర్‌లెస్‌గా చూసే అమ్మాయిలు ఎవరైనా వుం టారా ? కళ్ళల్లో పెట్టుకుని చూసు కుంటానంటే వద్దనే వారెవరయినా వుంటారా? ఏమన్నా అంటే విసురుగా జవాబులు చెప్పటం ! ప్చ్ ? తల ఒక సారి దులుపుకున్నాడు చెంపలో

అక్కడా అక్కడా మెరుపు తీగల్లా ఒకటీ అరా నెరిసిన వెంట్రుకలు. తల ఎగురవేసుకున్నాడు ఒకసారి తమా షాగా! గబగబా టై నాట్ సర్దుకుని క్రిందకు వచ్చాడు. అది నాలుగంత స్థుల భవనం - నాలుగో అంతస్థులో అంతా మెటీరియల్ వుంటుంది. మూడో అంతస్థులో వి. ఐ. పి. రూమ్స్ వుంటాయి. రెండో అంత స్థులో టైపిస్టులు, క్లర్కులు మొద లయిన నత్తానామూ వుంటూ వుం టారు. క్రింద అంతా షాపింగ్‌కి ఇచ్చే సారు. విజిటర్స్ లౌంజ్‌లో ఎర్రటి ముఖమల్ సోఫాసెట్స్ వున్నాయి. ఒక సోఫాలో లేత అరిటాకు పచ్చని ఫుల్ వాయిల్ చీరలో ఒదిగి కూర్చుని వుంది కమల. నల్లని బ్లవుజ్. మెడలో సన్నటి బంగారపు గొలుసు. చెవులకి ఒంటిరాయి నక్షత్రాలు. ముక్కుకి సన్నటి మంచి ముత్యం ముక్కుపుడక. నుదుట కనీ కనిపించని తిలకం బొట్టు. ఒక చేతికి రెండు ఆకుపచ్చని గాజు గాజులు. ఒక చేతికి వాచీ! చలపతిని చూస్తూనే లేచి నిలబడి విష్ చేసింది.

"మీరేనా ...." అన్నాడు. ఆ పిల్లని పరిశీలనగా చూస్తూను.

"కమలను...." అంది, కొంచెం బిడి యంగా వున్నట్లు అన్పించింది.

"ఏమిటింకా కూర్చుందామా ?" మళ్ళీ కమల కూర్చుండి పోవటం చూసి అడిగాడు.

"కాదు - మామయ్య కారు పంపు తానన్నారు"

"పోనీ కంపెనీ కారులో వెళ్ళ దామా ?"

"వద్దొద్దు!" అందిబిడియంగా. మాట వరసకి అన్నాడే కాని నిజంగా అతనికి కంపెని కారులో స్వంతపనికి వెళ్ళాలని లేదు. కారు వచ్చింది. వెనక సీట్లో యిద్దరూ చెరొక చివరా కూర్చు న్నారు. పెద్ద ఐరన్ గేట్ – గేటుకి ఒక వెంపు చిన్న బంగాళా పెంకులతో కప్పు వేసియున్న ఒక గది! ఆ గది లో గూర్ఖా వుంటాడు. గేటులోంచి కారు వచ్చి పోర్టికోలో ఆగింది.

కమల కొంచెం పొట్టిగా వుంటుంది. చలపతి భుజం దాకా కూడా రాదు – సన్నగా పొడుగ్గా వున్నట్లే వుంటుంది. చామన చాయ - మోకాలు మడత దాటిన పొడుగాటి జుత్తు ఆమెకి పెట్టని అభరణం. కళ్ళు సన్నగా నల్లగా వుం టాయి. మనుష్యుల మంచి తనం మీద నమ్మకము వాత్సల్య భావమూ కురిపిస్తాయి ఆమె కళ్ళు. కుదురయిన పిల్ల అని చూడగానే అన్పించుతుంది.

"చాలా సేపు వెయిట్ చేసారా, పీతాంబరం వస్తాడేమో అని చూసాను" అన్నాడు.

ఎవరా పీతాంబరం ? ఏమా కథ ? అని ఇద్దరూ కుతూహలం కనబరచ లేదు. "పదండి!" అన్నాడు. ఇద్దరూ మళ్ళీ పిల్లి పిల్లల్లా కారు వెనుక సీట్లోకి వెళ్ళి కూర్చున్నారు. పెద్ద లగ్జూరియస్ హొటలు ముందు కారు ఆపాడు. ఆయన దిగాడు. "ఇదేమిటి ఇక్కడకు తీసుకువచ్చాడు ?" అని ఇద్దరూ అను కున్నారు.

# చండూర్ రచనలు

నేటి విలువలు
దూరాన్ని జయించిన మానవుడు
ఛార్లెస్ స్టీన్ మెజ్
కథానికలు
జీవనమార్గం
ఎలినార్ రూజ్‌వెల్ట్
తొలి పాఠాలు
ప్రేమగాథ
హెలెన్ కెల్లర్
డా॥ మేరి వెర్షిస్
నేల - నీరు
మహా నగరంలో
జీవితం
నవ చైనా
ప్రతి గురువారం
ఆరు కథలు
చెట్లు
మరొక ఆరు కథలు
ఈ నాగరికత
నాలుగు రోడ్లు
అణుశక్తి
బాలరాజ్యం
గ్రామ వైద్యుడు
సాహస యాత్ర
అంతేనా
కాఫీ మానెయ్యడం

పరిచయం చేసిన పుస్తకాలు
అన్యాయం
ఆఖరి కోరిక
ఎక్కడికి కమలా ?
భానుమూర్తి భార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్ని గ్రంథాలు
సీతతో సినీమాకు
ప్రజానాయకుడు ప్రకాశం
నట్టింట దీపం
మాంగుటూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతా ఫలాలు
భాష
పూసల మేడ
శివరావు
కలడో లేడో
మావో పాలనలో
చైనాలో మైనారటీలు
అమెరికా
జులై నాలుగు
వరదల్లో వాంగ్
మాతా భూమాతా
చీమలబారు

**వీటిలో ఏ ఒక్కటీ ప్రస్తుతం అచ్చులో లేవు. చదవాలనుకున్న వారు మీకు చేరువలోనున్న లైబ్రరీలో దొరికితే చదవండి**

"ఎయిటీఫోర్" - రిసెప్షనిస్ట్ దగ్గర రూం తాళం తీసుకొని మొదటి అంతస్తు లోనికి వెళ్ళాడు. ఆయన తాళం తీసుకున్నాడంటే ముందే 'రూం' బుక్ చేసుకుని వుంటాడు అని తెలుసుకున్నాడు చలపతి. చెరువంత ఇల్లు వుండగా హోటల్ రూంకి ఎందుకు పిలుచుకు వచ్చాడు ఈయన ? - అనుకున్నాడు. బజర్ నొక్కాడు. బేరర్ వచ్చాడు. రెండు రకాల స్వీట్స్, రెండు రకాల సేవరీస్ చెప్పాడు. నిశ్శబ్దంగా వుంది అంతా. ఛానల్‌లో సన్నని వీణా వాదనం వస్తూంది. మౌనంగా ఫలహారాలు తీసుకున్నారు. కూల్‌డ్రింక్స్ త్రాగారు. కాని మనసులో తహతహగా వుంది విషయం ఏమిటా అని !

"ఎయిటీఫోర్ నాకు అచ్చివచ్చిన నెంబరోయ్ ! నేను ముఖ్యమయిన వ్యవహారాలన్నీ ఈ గదిలోనే సెటిల్ చేస్తాను. ఇందులో చర్చించే విషయాలు అన్నీ శుభప్రదంగా అనుకూలం అవుతాయి. ప్చ్ ! పీతాంబరం నాకు హాథ్ ఇచ్చాడోయ్" అన్నాడు.

పీతాంబరం ఎవరో ఏ విషయంలో హాథ్ ఇచ్చాడో చలపతికి తెలియక చెవుల పిల్లిలా చూసాడు.

"పీతాంబరం నా చిన్నప్పటి క్లాసు మేట్ - ఆరింటికల్లా హాజరుగా వుంటానన్నాడు."

తమని పిలిచి ఆ పీతాంబరం కోసం తహతహలాడుతాడేమిటి ఈ పెద్దమనిషి ? - అనుకొన్నాడు చలపతి.

"సర్లే వచ్చేది కనపడటం లేదు. చూడవయ్యా, నిన్నమీ నాన్నకీ అమ్మకీ చెప్పాను. వాళ్ళు ఒప్పు కున్నారు. సంతోషించారు."

"ఏమిటి ఒప్పుకోవటం ?"

"నీకు పెళ్ళిచేయటానికోయ్ !"

ఒక్కక్షణం ఆశ తళుక్కుమంది. మేరిలిన్ ఈయన ద్వారా కబురంపిందా ? భ్రమర వచ్చేస్తానన్నదా ? వాళ్ళ కుటుంబ వ్యవహారాలు కూడా ఈయనేగా బాధ్యతగా చూసేది? అర్థం కానట్లు చూసాడు గోపాలరావు వెంపు.

"ఇన్ని రోజులూ పంతులు గారి కుటుంబాన్ని కనిపెట్టుకుని వున్నారు. ఆయన చేయగలిగిన సాయం చేశారు. బోడిగుండుకీ, మోకాలికీ ముడి పెట్టడం ఎందుకు ? మీ నాన్నకి ఒక్కగాని ఒక్క పిల్లాడివి - ఇన్ని నీళ్ళు వదలటానికి పనికిరాకుండా చేసుకోవటం ఎందుకయ్యా, ఇంకా బ్రాహ్మణ్యం అంటూ ఏమూలో ఒక వార కాస్త తగలబడింది కదా - మన పారమార్థికం చూసుకోవద్దా ?"

చలపతికి జ్ఞాపకం వచ్చింది. చిన్నప్పుడు తల్లి తండ్రి తమ తాతగారి వూరు తీసుకువెళ్ళి మామయ్య కొడుకులతో తనకి ఉపనయనం చేయటం ! హాస్టల్లో వుండగా జంధ్యము తెగిపోయింది. తిరిగి వేసుకుందామన్న ఆలోచన రాలేదు. బ్రాహ్మణులలో ఇప్పుడు తమది ఏ శాఖో కూడా జ్ఞాపకం రావటం లేదు. చలపతి ఆలోచనలో పడటం గమనించాడు నవ్వాడు.

"అందుకనేనయ్యా, నేను ఈ పిల్లని నీకు ఇచ్చి ముడిపెట్టేదామనుకుంటున్నాను. నిండా ఇరవయి రెండేళ్ళ

లేవు. ఈ పిల్లకి తల్లీ తండ్రీ నేనే! నాకు స్వయంగా మేనకోడలు. ఇద్దరూ ఒక గొడుగు క్రిందే తల దాచుకుంటున్నారు. నా కళ్ళ ఎదురుగా వుంటారు. నిన్ననే నాకీ ఐడియా వచ్చింది. పీతాంబరానికి కూడా వెంటనే చెప్పేసాను. అతను భేష్ కానివ్వమన్నాడు. ఇదివరకు ఒకటి రెండు సార్లు చూసి వుంటావు. కాని ఇప్పుడు నీకు కావల్సిన వ్యక్తిగా చూడు" – అన్నాడు. కమల నిజం పెళ్ళికూతురిలా ముడుచుకుపోయింది.

"నీకు తెలియని జీతం కాదు ఈ పిల్లది. నీకు ఉద్యోగం చేయించటం ఇష్టమయితే చేయించు, లేకపోతే మానేస్తుంది!"

"నాన్నగారితో చెప్పండి" అన్నాడు చలపతి.

"నిన్న చెప్పాను. నేను ఈ పిల్లకి కంచుకోటలాంటి వాడిని. విమలకి పెళ్ళి పేరంటం హుందాగా చేద్దాము. నా అండ నీకెప్పుడూ వుంటుంది!" అన్నాడు గోపాల్రావు.

రామజోగి పంతులు గారికి పెద్దతనం వచ్చింది. మేరిలిన్‌కి బోలెడు ఆస్తి ఇచ్చారు. మేరిలిన్ పిల్లలు అనుభవించగలుగుతారు. ఇంక జీవిత విధానమా? ఒకొక్కళ్ళు ఒకోరకం జీవితం ఇష్టపడతారు. సంఘంలోని మామూలు నిత్యకృత్య కార్యకలాపాలకి విఘ్నం కలిగించనంత వరకు ఎవళ్ళ జీవితాన్ని వాళ్ళు జీవించటానికి హక్కు ఉంటుంది.

"చలపతికి పెళ్ళి చేస్తున్నారుట తాతయ్యా!" అంది మేరిలిన్.

"అల్లాగా?" అన్నాడు.

"గోపాల్రావుగారి మేనకోడలుట!"

"బాగుంది, ఇన్నాళ్ళకి అతనూ ఒక గృహస్థుడు అవుతున్నాడు. పోనీలే పాపం" అన్నాడు.

"ఎప్పటికయినా భ్రమరా అతనూ ...."

"చాలాకాలం చూసాడమ్మాయీ, ఇంకా అతన్ని ఎదురు చూడమనటం భావ్యం కాదు. భ్రమరకి వివాహం అంటే మోజులేదు. సంసార జీవితం అంటే ఆ పిల్లకి నచ్చదనుకుంటాను. లేకపోతే ఇన్నాళ్ళెందుకు ఆగుతుంది, ఈపాటికి పిల్లలతల్లి అయేదికదా!" అన్నాడు. మేరిలిన్ మాట్లాడలేదు. సుగుణ, సుమన తమ సంసారాలు చేసుకుంటున్నారు. తన తల్లికూడా తన పిల్లలకి ఒక తీరువ వచ్చిందని సంతోషించింది. శీల, మాలలు బాగా చిన్నవాళ్ళు. చలపతికి ఇచ్చి పెళ్ళి చేద్దామన్నా బావుండదు. పిల్లలిద్దరూ బాగా చదువుకుంటున్నారు. భ్రమర ఒక్కర్తి కొంచెం దారిలోకి వస్తే ఇంక తనకి బెంగ వుండదు. ఆ పిల్లకి తండ్రి పోలిక వచ్చిందా? అసలుతన తలంపే లేదు. ఆ విశ్వామిత్రుడి కూతురే భ్రమర!

ప్రయివేటు రూంలో వున్నాడు చలపతి. బజర్ నొక్కిన ధ్వని.

"యస్స్ కమిన్!" అన్నాడు తలవంచుకునే.

ఆర్గండీ చీర రెపరెపకి తల ఎత్తాడు. కమల అరవిరిసిన తామర

పూవులా తెల్లని ఆర్గండీ చీరలో ఎంతో స్వచ్ఛంగా ఉంది. ఈ పిల్లతో జీవితం పంచుకోవాలి తాను. ఈమెని సంతోషపెట్టగలడా? తనవల్ల ఏ స్త్రీ కూడా దుఃఖపడకూడదు.

"కూర్చోండి. ఏమిటిలా...."

"రావటం అనా? రాకూడదనే అనుకున్నాను. కానీ ఎందుకనో మిమ్మల్ని పెళ్ళికి ముందు కొన్ని విషయాలు అడగాలని అన్పించింది."

"ఓ యస్. అడగండి. నిజానికి నన్ను గురించి నాకంటే మీ మామయ్య గారికే ఎక్కువ విషయాలు తెలుసును-నా బయోడేటా ఆయన మీతో చెప్ప లేదా?"

"ఆ రోజు హొటలులో హఠాత్తుగా తన నిర్ణయం చెప్పేసరికి నాకు నమ్మబుద్ధి కాలేదు"

"అంటే...."

"మీరు ఆర్. జె. పి. లో ముఖ్య పదవిలో వున్నారు. నేను చాలా చిన్న ఉద్యోగిని. నాకు పెద్ద పెద్ద జీవితాశయాలు లేవు. నాన్న అమ్మ లేక మేనమామ పంచన తలదాచుకున్నాను. ఉద్యోగం ఇప్పించారు మామయ్య - దానికి మహదానందపడిపోయాను. ఇపుడు పెళ్ళి చేస్తాను - అంటున్నారు. అసలు పెళ్ళి అవుతుందనే ఊహ కాని, అవ్వాలనే కోరిక కానీ నాకు లేవు. నన్ను నేను పోషించుకుంటున్నాను. కానీ మామయ్యకి నన్ను ఒకరి చేతిలో పెడితే కాని ఆయన బాధ్యత తీరదు. అందుకనే తలవంచుతున్నాను."

"ఊ........చెప్పండి"

"ఒక పవిత్రత కోసం వివాహ బంధం ఏర్పరచారు. ఆ పవిత్రతని కోరేవాళ్ళే ఆ బంధానికి తల వంచాలి. 'నాతి చరామి' అని అగ్నిసాక్షిగా వ్రతన చేస్తారు కళ్యాణమంటపంలో"

"అవును - మీ సందేహమేమిటో తెలుసుకోవచ్చా?" అన్నాడు.

"ఒకప్పుడు మీరు మెరిలిన్ గారి అమ్మాయిని........"

"భ్రమర సంగతా? అదెవరు చెప్పారు - మీరెప్పుడయినా చూసారా ఆమెని?"

"అందరూ అనుకున్నారుట కదా ఆ రోజుల్లో!"

"మీరెన్ని రోజులయింది గంలో చేరి?"

"రెండేళ్ళు నేను చాలా చిన్న దాన్ని. మీరు అనే మన్నన దయచేసి...." - కమల కనులు తడి అయ్యాయి.

"అలాగే, నువ్వు చాలా చిన్న దానివి. నిజానికి నీకూ నాకూ పెళ్ళి చేద్దామన్న ఊహ మీ మామయ్యకి కలగటం నాకు ఆశ్చర్యంగా వుంది భ్రమర నాకన్నా నాలుగయిదేళ్ళు పెద్దది. చాలా రోజులు కలిసి చదివాం- నేను చదువుకునే ఊరికి, తనూ ఉద్యోగం అంటూ వచ్చి కాపురం పెట్టింది. ఆమె అంటే నాకూ అభిమానం వున్న మాట నిజమే. ఆమెకి ఏదన్నా అవసరం వచ్చినా పక్కన నువ్వు నిలబడాలి, అంతే కాదనగల ధాష్టీకం నాకు లేదు. చిన్నప్పట్నించే నేను వాళ్ళ ఆశ్రయం మీద బ్రతుకు బాట నిర్ణ

యించుకుని రావటం వల్ల కృతజ్ఞతా భారం కావచ్చు. నా వయస్సుని ఆమె ప్రేరేపించినప్పుడు నేనూ వూరుకోలేక పోయాను. కాని దానికి నేను కటుబడి వుందామన్నా, ఆమెకి మన కట్టుబాట్లు వివాహ బంధాలు ఇష్టం లేవు. నిజానికి నన్ను దూరం చేసుకున్నందుకు ఆమె దుఃఖపడటం లేదు. ఆమెకి స్వేచ్ఛ కావాలి. ఒక బంధంలో ఇరుక్కు పోవటం ఇష్టం కాదు. ఇంక అందుకని ఆమె బ్రతుకులోనికి నేను జొరపడటం లేదు. ఎంతకని ఆమెని బ్రతిమాలు తాను చెప్పు?''

''గతించిన జ్ఞాపకాలు మిమ్మల్ని బాధపడేట్లు చేస్తున్నాయా ?''

''నీకు నేనెల్లా కన్పించుతున్నాను? బాధగా వున్నట్లు కన్పించుతున్నానా?''

''నాకు తెలియడం లేదు''

''పోనీలే, చాలారోజుల్నుంచి ఇంట్లో బంధువుల్లో నాకు వివాహం చేయా లనే పట్టుదల వుంది. కాని నేనే వాయిదా వేస్తూవచ్చాను. ముందు ఆర్థిక సుస్థిరత రావాలి. ఎదిగున్న చెల్లాయికి పెళ్ళి చెయ్యాలి; అమ్మా నాన్నలని జాగ్రత్తగా చూడగలగాలి. ఇవన్నీ సమకూర్చాక అప్పుడు నా సౌఖ్యం కోసం నేను ఆలోచించు కోవాలి''

''చాలా మంచివారు మీరు!''

''అప్పుడే కితాబు ఇచ్చేయకు! నిన్ను నా జీవితంలోకి ఆహ్వానించే ముందు ఇంకొక మాటకూడా చెప్పాలి - విని బాగా ఆలోచించుకుని నీ నిర్ణయం చెప్పాలి.''

''ఏమిటి ?''

''ఎప్పుడు ఏ స్థితిలో వచ్చినా ఆమెని ఆదరించగల ఉదారతని నాకు మిగి లించాలి, నువ్వు'' అన్నాడు, ఆ పిల్ల కేసి గాఢంగా చూస్తూ!

కన్నీళ్లతో కమల చెంపలు తడి శాయి. చలపతి ఆర్ద్రతతో అన్నాడు. ''ఎందుకు ఆ కన్నీళ్ళు?'' ''మంచు ముత్యాలు వెలుగు రేఖ ముందు కరిగిపోతాయి. - ఆ భ్రమర ఎంతో అదృష్టివంతురాలు'' అంది కమల. దగ్గరగా తీసుకుని, ఇవి మన జీవ యాత్రకు అనురాగ బాష్పాలవాలి - అంటూ ఆమె కన్నీరు తుడిచాడు. చలపతి.

''పీతాంబరం చేత ముప్పయి వేల రూపాయలకు చెక్కు పంపిం చాడు గోపాల్రావు గారు'' అన్నాడు లక్ష్మణరావు సంబరంగా. ''నాకంత ఆర్భాటం నచ్చదు. ట్రెడిషన్‌కి లోటు లేకుండా సింపుల్‌గా చేయించేట్లు చూడండి'' అన్నాడు చలపతి. ఇంట్లో వసుధ ఇద్దరు పిల్లలతో భర్తతో వచ్చింది. ఇంకా అనసూయ అన్నదమ్ములు, లక్ష్మణరావు బంధు వులు కూడా వచ్చారు. తెప్పలుగ చెరువు నిండిన కప్పలు పదివేలు చేరురా అన్నట్లు లక్ష్మణరావు కిప్పుడు చాలామంది బంధుబలగం చేరారు. గోపాల్రావు ఇంట్లో అంత హడావిడి లేదు. గుళ్ళో పెళ్ళిచేసి, పిల్లని పెట్టెబేడా సర్ది లక్ష్మణరావు ఇంటికి పంపించి వేయటానికి నిర్ణయం చేసారు. కమల రెండు మూడు చీరలు

కొనుక్కుంది. ఏ కళను వుందో, గోపాలరావు భార్య మూడువందలు పెట్టి పట్టుచీర కొనుక్కుని వచ్చింది. ఇంక వారం పదిరోజులలో ముహూర్తం- పెళ్ళి సంబంధం సెటిల్ అయినది మొదలు కమల ఆఫీసుకి వెళ్ళటం మానేసింది. రెండు నెలలు సెలవు తీసుకుంది. ఆరాత్రి పండు వెన్నెల - చలపతికి నిద్ర పట్టడంలేదు. పద కొండు దాటాక గదిముందు వరండా లోకి ఈజీఛైర్ లాగుకొని కూర్చున్నాడు. భ్రమరకి తనకి జరిగిన వాదోపవాదాలు గుర్తుకు వచ్చాయి. ఒకసారి భ్రమరకేమి వచ్చిందో పూనకం, తెల్లటి జార్జెట్ చీర మోచేతుల వరకు ఉన్న జాకెట్టు, వంటి పేట ముత్యాలగొలుసు, వంటిమిద తేలిగ్గా ఇంటిమేట్ పరిమళం. చల్లగా, చాలా సుఖంగా తృప్తిగా వుంది ఆమెని చూస్తుంటే. మెత్తటి డన్‌లప్ పరుపు మీద వంపుగా కూర్చుంది అతన్ని ఆనుకుని. అతను అమర సుఖానుభూతిలో వున్నాడు. ఒక కిళ్ళీ అతనికి ఇచ్చింది. పచ్చకర్పూరం, కుంకుమ పూవు ఘుమ ఘుమ లాడింది.

"తాంబూలం స్వీకరించం నాథా!" అంది నవ్వుతూ.

"స్వీకరించాను"? అన్నాడు చలపతి.

"ఇంకేమి చేస్తారు మీ తెలుగు. భార్యలు - కాళ్ళు పట్టనా?" అంది వేళా కోళంగా.

"కాళ్ళు పట్టక్కరలేదు, పీక నొక్క క్కరలేదు. ఈ రోజుల్లో అంతలా ఎవళ్ళూ - కాళ్ళు పట్టించుకోవటం లేదు" - అన్నాడు.

"నీకేం తెలియదు - కాళ్ళు పట్టించు కోవడం కూడా శృంగారంలో ఒక భాగమే - కాళ్ళు పట్టకపోతే ఇంక భార్యేమిటి - నీముఖం?"

"నీకు మా పద్ధతులు ఏమీ తెలి యవు - ఒక పద్ధతి అమలు జరుపు తూంటే దానికి మూలాధారమేమిటో తెలుస్తూనే వుంటుంది. తెలియకుండా ఎగతాళి చేయకూడదు"

"సర్లే ఆ పద్ధతులు నాకేం నేర్చు కోవలసిన అవసరం లేదులే! పూర్వం ఆడవాళ్ళు మావారు కొట్టారు తిట్టారు అంటూ మొత్తుకొనేవాళ్ళు ధైర్యంగా. ఇప్పుడు నాగరికత మేలి ముసుగు అందరి అంతరంగాలనీ బలవంతంగా కప్పెడుతుంది. ఇంట్లో భర్త పాదసేవ చేసే ఇల్లాలు, పైకి తానే పెత్తందారు లాగా ప్రవర్తిస్తుంది. తన భార్య అందగత్తె అని అందరికీ తెలియచేయా లని వెంట త్రిప్పుకుంటాడు, మళ్ళీ, వాడు ఇల్లా చూచాడు, అల్లా చూచాడు నీ భుజం తాకాడు - అంటూ మొదలు పెడ్తారు. ఈ రంపపాని భరించలేక ఆడవాళ్ళు లోలోపల కుములుతారు." భ్రమరని దగ్గరకి తీసుకొని పొట్టమడత వద్ద ముఖం రుద్దాడు ప్రేమగా - వారం పదిరోజులు హాయిగా గడిపాడు.

"పతీ, ఇల్లూ వాకిలీ మరిచి పోయావా?" అంది.

"నేనేం మర్చిపోలేదు."

"అయితే ఇల్లావుంటే మనకి రోజు లెలా గడుస్తాయి? వేగం తెములు. ముసలాడి దగ్గిరకు తీసుకు వెళ్తాను. ఏదన్నా పని ఇప్పిస్తాడు."

"ఎవరా ముసలాడు?" భ్రమరని చేతో చుట్టివేస్తూ అడిగాడు.

"కేసవసేన్!"

"ఇంకా అతన్ని వదలేదా?"

"అతను న్యూడ్స్ వేస్తాడట దానికి తగినదానిని నేనేనట. పేమెంట్ చాలా బాగుందిలే-ఈమాత్రంపుంజుకున్నానంటే కేశవసేన్ గిరాకి తగలటం వల్లనే!'

"సిగ్గు వేయదా నీకు - ఎల్లా వుంటావు అల్లా?"

"పుట్టినప్పుడు బట్ట కట్టలేదు. పోయేటప్పుడు వెంటరాదు - పాట వినలేదా నువ్వు? సిగ్గెందుకు!"

"వినలేదు కాని భ్రమరా, మనసా వాచా శరీరం ద్వారా ఒకటయి నాము. ఇంక ఏద్దేవా మానేసి ఇంటికి రా!"

"ఇంటికి వచ్చి పిల్లా పాపలతో కలకల్లాడుతూ వుండు - అంటావు. కేశవసేన్ ఆరువేల రూపాయలు అడ్వాన్స్ ఇచ్చాడు, చిట్టినాయినా!"

"ఆ డబ్బు వాపసు ఇచ్చేద్దాము."

"పతీ! నేను ఒక నీతీ జాతికి చెందనిదానిని. అమ్మమ్మ డైవోర్సీ. అమ్మని నాన్న వదిలేసాడు. వాళ్ళూ మొదట్లో నీలాగా అభిమానం, ప్రేమ గ్రుమ్మరించిన వాళ్ళే - ఎంతో అదర్శంగా సంసారాలు మొదలుపెట్టిన వాళ్ళే. మధ్యలో వదులుకుని వెళ్ళి పోయారు. బాధ్యతలకి భయపడి పారిపోయే పిరికిపందలని అంటి పెట్టుకుని నేనెందుకు వుండాలి? నాది అయిన జీవితం నేను జీవించుతాను."

"అల్లా ఎన్ని రోజులు? ఎప్పటి కయినా ఒక ఆసరా కావద్దా?"

"ఆసరా ఎవరికి కావాలి? ఎవరికి నాలుగు డబ్బులు పారేస్తే వాళ్ళే ఆసరాగా వుంటారు. జీవితకాలం తోడుగా నీడగా వుందాము-అని అగ్నిసాక్షిగా ప్రమాణాలు చేసి, పెళ్ళిళ్ళు చేసుకున్న వాళ్ళు ఎంతమంది భార్యలని వదిలేయటం లేదు? వాళ్ళకి ఆసరాగా ఎవరు వుంటున్నారు? సంఘ పరమయిన ఈ బంధాలు ఎంత మందికి కాళ్ళకి బంధాలు వేయించ కలుగుతున్నాయి? త్రెంచుకోలేక అసూయా ద్వేషాలతో ఒకరి ఉనికిని మరొకరు సహించలేక, ఉక్కిరి బిక్కిరిగా ఒక కప్పు క్రింద బ్రతకటం కంటె దుర్భర నరకం ఎక్కడవుంటుంది చెప్పు?"

"అంతా నీలా ఆలోచించితే కుటుంబ వ్యవస్థ వర్ధిల్లటం ఎల్లా భ్రమరా?"

"కుటుంబ వ్యవస్థ కేవలం ఆర్థిక రక్షణ కోసం ఏర్పాటు అయివుంది. తనని తాను పోషించుకోగల శక్తి మనిషికి ముఖ్యము. పెళ్ళి అంటే ఒక కట్టుబాటు, సామాజిక పరమయిన కట్టడి. దాని పరిధి చాలా సంకుచితం. అందులో నేను ఇమడలేను. నన్ను వదిలేయి."

"నిన్ను వదలకుండా కట్టేసుకున్నానా ఎప్పుడయినా, భ్రమరా?"

"కట్టుబాటుకి నేను లోబడను కదా?" అంది నవ్వుతూనే.

చలపతికి శరీరం ఝల్లుమంది. అయిదారు సంవత్సరాలు అయింది. ఇప్పటికింకా ప్రతి క్షణం తన మనసు,

శరీరం ఆ సంఘటనల జ్ఞాపకాలతో పులకించి పోతుందేమిటి? ఈ మధ్య ఆవిడ జాబులు వ్రాయటంలేదు. తను పోవటం మానుకున్నాడు. ఎన్నాళ్ళని ఆమె చుట్టూ తిరగటం? విసుగెత్తి పోయింది. తను అఖ్ఖర్లేనివాడు ఆమెకి, బాధ వేసింది చలపతికి.

"బాబుగారూ!" - ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు చలపతి.

"పంతులుగారి మేడలోంచి కబురు వచ్చింది బాబూ!"

చలపతి లేచి షర్టు తొడుగుకున్నాడు. ఇంట్లో అందరూ నిద్ర పోతున్నారు కాబోలు నిశ్శబ్దంగా వుంది.

రామజోగి పంతులుగారి మేడలోకి వెళ్ళాడు. పంతులుగారు ఎనిమిది గంటలకల్లా తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుని పడుకుంటారు.

"కబురంపారుట!" — హాలులో మేరిలిన్ ఏదో పుస్తకం పట్టుకుని చదువుకుంటున్నది. ఇంత రాత్రి వరకూ ఈమె కూడా మేలుకుని వుంటుందా? - అనుకున్నాడు.

"పైకి వెళ్ళు, చలపతీ!" అంది మేరిలిన్. ఆమె గొంతు బొంగురుగా ధ్వనించింది.

గబగబా పైకి వెళ్ళాడు.

"కబురంపితే కానీ ఇంటికి రావటం మానేశావుట. పెద్దవాడివై పోయావా?" అంది భ్రమర. మెరుపు కొట్టినట్లు అయ్యింది చలపతికి.

"వాట్ ఎ సర్‌ప్రయిజ్ - ఎపుడు వచ్చావు?" అన్నాడు. పొడిగా ఎండి పోయినట్లుగా వుంది గొంతు. మంచి నీళ్ళు తాగాలి - అన్పించింది.

"ఉదయమే వచ్చాను పెళ్ళి హడావిడిలో వున్నావు—పెద్ద ఉద్యోగస్థుడివాయె - మా ఇంటి వెంపు వచ్చేపని ఏముందిలే నీకు?" అంటూ నిమ్మరసం తెచ్చి ఇచ్చింది. తన దాహం గుర్తించింది కాబోలు - అనుకున్నాడు. గబగబా త్రాగేసాడు.

"నన్ననకపోతే నువ్వే రావచ్చుగా మా ఇంటికి? నువ్వన్నట్లు హడావిడిగానే వున్నాను మరి! - అర్ధరాత్రి కబురంపటం ఏమిటి?"

"మన సంగతి చీకట్లోనే మాట్లాడుకోవాలి - నేను మీ ఇంటికి వస్తే మీ అమ్మగారు, నాన్నగారు త్రాచుపాము కాళ్ళకి చుట్టేసినట్లు కంగారు పడి పోతారు. అవసరం నాకు నీతోనే కానీ వాళ్ళతో కాదుగా, చలపతీ"

"ఏమిటా అవసరం?" అన్నాడు.

"అటు చూడు!" అంది నవ్వుతూనే. అయిదారేళ్ళ పాప లేత బ్లూ కలర్ నైటీలో మంచం మీద గాఢ నిద్రలో వుంది.

"ఏమిటి?" అన్నాడు. పాపాయి లేత గులాబీ రంగులో వుంది. చాలా సున్నితంగా, పట్టుకుంటే కందిపోతుందేమో అన్నట్లు వుంది.

"కుటుంబ వ్యవస్థ! ఆ పాపకి ఒక తండ్రి వుంటే బావుంటుంది అనిపించిందోయ్! డబ్బుకి లోటు వుండదు నీకు తెలుసుగా? నా అవసరానికి ఆదుకునే మిత్రుడివి నువ్వే కనిపించావు నా ఆలోచనల్లో! అందుకనే

పరిగెత్తుకుని వచ్చాను"

"భ్రమరా, ఇన్నాళ్ళకి ఒక కుటుంబ వ్యవస్థలో ఇమడాలి అన్పించిందా నీకు, చాలా సంతోషం, భ్రమరా !" అన్నాడు దగ్గరకి వెడుతూ.

"దూరం దూరం - మన ఇద్దరికీ ఇంకా చాలాదూరం వుందయ్యా, బాబూ !'

'అల్లా అనకు, భ్రమరా ! నీ గురించిన ఆలోచనల్లో వుండగా నీవే కన్పించావు. ఇంక నా కట్టడిలో వుండక తప్పదు - మనం పెళ్లి చేసుకుందాము"

"ఇప్పుడు నువ్వు ఒకరికి దత్తం అయిపోయావు - నా కేమీ బెంగ లేదు. పాపాయి నిజంగా మన పాపాయే - విశ్వామిత్రుడివి కాకు. దానికి ఒక రక్షణ కల్పించు, చాలును"

"ఇంత మంచి మాట నాకు ఇంత ఆలస్యంగానైనా చెప్పాలి అన్పించింది. చాలా సంతోషం, భ్రమరా - చాలా సంతోషం !"

"ఈ పాపాయి వంకన నీవు నన్ను కదలనీయవు, పతీ ! నీ అనురాగం నాకు తెలుసును - కాని నీ మీద ప్రేమ నిన్ను పతనం చేయటానికి సాహసించ లేదు. ఇప్పటికయినా నీవు స్వయంగా పెళ్ళిచేసుకుంటున్నావు - ఇంక పాపాయికి నీ రక్షణ వుంటే అది దేవతాకన్య అయిపోతుంది అని ఆశతో వచ్చాను"

"నీకు కూడా ఇలాటి పిచ్చా, భ్రమరా అంబూ ?"

నాకు కాదు - నా పిల్లకు ! అది చలపతి కూతురుగా పెరుగుతుంది.... కమల నీకు మంచి భార్యయేగాక, ఈ పాపకు దయగల తల్లికూడా అవుతుంది. మీ ఇద్దరి మీదా నాకు నమ్మకం ఉంది" - అని భ్రమర అంటున్నప్పుడు, కాళ్లకింద నేల కదులుతున్నదా అనిపించింది చలపతికి.

"నీ మాట నేను కాదనగలనా భ్రమరా ?" అంటూ చలపతి పాపని రెండుచేతులతోనూ ఎత్తుకు, గుండెలకు హత్తుకున్నాడు.

(సమాప్తం

సమీక్షలు

# చిత్రజగతి

## ఎవర్‌గ్రీన్ వారి 'ప్రణయ సాగరం'

ఆత్మరక్షణ కోసం యింట్లో నుంచి పారిపోతూ డబ్బుల్లేకుండా బస్సెక్కిన ఫిలోమినాని (కల్పన). తోటి ప్రయాణీకుడు రఘు (మోహన్), ఆదుకొని, ఆమెకి టికెట్ కొంటాడు. అయితే, తన అశ్రద్ధ వల్ల పెట్లోనుంచి జారిపోయిన నాలుగు వందలూ ఈమె కాసిందనుకొని నిందవేస్తాడు. మద్రాసులో బస్సు దిగాక, అభిమానవతి అయిన ఫిలోమినా, తన చేతి గాజులమ్మి సాయింత్రం ఆరు గంటలకు బీచిలోని అదే గాంధీ విగ్రహం వద్ద అందజేస్తానంటుంది. కొంచెం ఆలస్యమైనా ఆ నాలుగు వందలూ తీసుకొచ్చి యిస్తుంది. కాగా, ఈ యువతీ యువకుల చేతిల్లోని డబ్బు, బీటు పోలీసులకి అనుమానాస్పదంగా తోచడంతో, చివరకి కోర్టూ, కోర్టులో వారిద్దరికి విడుదలాను! తన భర్త అని అబద్ధం చెప్పి, రఘుని కాపాడుతుంది ఫిలోమినా. బికారులైన ఈ యువతీ యువకుల ప్రణయానురక్తి ఎంతో హృద్యంగా సాగుతుంది. ఒకరికొకరై బతుకుతున్నప్పటికీ అది సరిహద్దు లతిక్రమించని రాగబంధం రిక్షా డ్రయివరుగా తనని పోషిస్తున్న రఘు పరిస్థితికి దీనురాలై, ఆరునెలల తర్వాత మనం కలుసుకుందామని చెప్పి మాయమవుతుంది ఫిలోమినా. అడయారు బస్సులో మాణిక్యం పారేసుకున్న కవరొకటి రఘు కంట పడుతుంది - అందులో పదివేలు వుంటాయి. స్వంతదారుకి అందజేసే మార్గం గానక ఆ పదివేలూ డిపాజిట్‌గా కట్టి, ఉదకమండల ప్రాంతానున్న యెస్టేట్‌లో ఉద్యోగం సంపాదిస్తాడు రఘు. అక్కడ ఇంటిపనులు చూసే అమాయకురాలి తండ్రి ఇల్లు అమ్మి కూతురు పెళ్లికి కట్నమిచ్చేందుకని భద్రపరిచిన పదివేలూ పోగొట్టుకున్న మాణిక్యమని తెలుస్తుంది. ఒకమ్మాయిలోని త్యాగబుద్ధీ, మరొకమ్మాయిలోని ప్రణయరక్తి రఘు జీవితాన్ని రంగుల హరివిల్లు చేస్తాయి. కల్పన, రేవతి, మోహన్ - ముగ్గురూ తమ పాత్రలు చాలా చక్కగా పోషించారు. సుందరరాజన్ దర్శకత్వం, నిర్మాత: వరలక్ష్మి; సమర్పణ: మురళీకృష్ణ.

## జయప్రదా వారి 'రాకీ'

'రా' అంటే రాముడు, 'కీ' అంటే కృష్ణుడు - ఆ రెండక్షరాలూ కలిపి 'రాకీ' అయాడు నూతన నటుడు శ్రీరామ్ కుమార్. డాడీ మమ్మీలు (రంగనాథ్ - రమాప్రభ) అసలు తల్లి దండ్రులు కాదు; తల్లి (కెఆర్ విజయ) అదే యింట్లో పదిహేనేళ్లుగా యితని కంట బడకుండా ఉంటోంది. తండ్రి (రామకృష్ణ) మోటారు సైకిలుని, దుర్మార్గులు (నూతన్ ప్రసాద్, కోట శ్రీనివాసరావు) తమ లారీచేత గుద్దింప డంతో, ఆయన అక్కడికక్కడ మర ణిస్తాడు ; గిరవాటు వేయబడ్డ ఆరేడేళ్ల అక్క ఏమయిందో తెలియదు. ఈ రాకీ బుర్రలోని చిన్ననాటి జ్ఞాపకాలన్నీ చెరిగిపోగా, తల్లినిచూసి కెవ్వున కేక వేస్తూ జడుసుకుంటాడు (మనస్తత్వ వేత్తలు దానిని అంగీకరించక పోయినా సినిమావారు వొప్పించేందుకు ప్రయ త్నిస్తారు). రాకీ తండ్రి, పదిహే నేళ్ల క్రితం, ఫ్యాక్టరీలో ఇంజనీరు ; వర్క ర్లకు ఇన్సూరెన్స్ తప్పనిసరి - అని యాజమాన్యంతో పోరాడిన వ్యక్తి. కారు యాక్సిడెంట్‌లో కాళ్లు రెండూ పోగొట్టుకున్న యజమాని (జగ్గయ్య) మంచివాడే! దుష్టగ్రహాలు (నూతన్ ప్రసాద్, కోట శ్రీనివాసరావు), యజమానినీ, యింజనీరునీ యిరువురినీ సఫా చేసి, వారసురాలిని, అంటే అయిదేళ్లమ్మాయిని (పెద్దయాక సువర్ణ), మేనత్తతో బాటు ఊటీపంపు తారు. పదిహేనేళ్ళు గడిచాక, రాకీ, ఆర్‌కె (రాజ్‌బాబు - విలన్ కొడుకు వీరిరువురూ ఆమె ప్రేమ పూజారుల తారు. 'బాధని పంచుకున్న వారే బంధువులు - పూలలాంటి కన్నులలో ముళ్లు దాచుకున్నాను'-అనే జయ (జయ ప్రద), ఈ యాక్షన్ పిక్చర్‌లో, కవితా ప్రసూనాలు చల్లుతూ, హృదయ గీతిక పలుకుతుంది. శ్రీరామ్‌కుమార్ ఉత్సా హము, ఒక అయిదు కొట్టమనే నారా యణ దైన్యం, రాజ్‌బాబు నటన, జయప్రద వెలిగించే సౌందర్య దీపం పిక్చర్‌కి పుష్టి నిస్తున్నాయి. దర్శ కత్వం : చంద్రశేఖరరెడ్డి. నిర్మాతలు : నీలవేణి కృష్ణ, సౌందర్య.

## వెంకట పద్మావతీ 'కలియుగ కర్ణుడు'

ఆదిశేషుకి (మోహన్‌బాబు) పంగనా మాల కింగ్ జార్జి (కోట శ్రీనివాసరావు) నమ్మిన బంటు ; నూరోపావురం కాల్చే సరికి నూరు తప్పుల శిశుపాలునిలా కథా పరిసమాప్తి అవుతుందని హెచ్చ రించే నమ్మినబంటు. ఈ ఆదిశేషు, పొరుగూరు జమిందారైన శరచ్చంద్ర ప్రసాద్ చెల్లెలు సీతని, గడ్డివాము వద్ద, చెంపలమీద గీట్లు స్పష్టంగా కని పించేటంత దౌర్జన్యంగా మానభంగం చేసి, తనని ప్రేమిస్తున్నట్లుగా అన్న గారికి నచ్చజెప్పమని శాసిస్తాడు. కుటుంబగౌరవం కోసం ఈమె చెబు తుంది. శరచ్చంద్రప్రసాద్ (కృష్ణ) ఆగ్రహావేశుడై చెల్లెల్ని కాల్చబోగా

మంచిమిత్రుడుసత్యం(మురళీమోహన్), యయాతి మాదిరి బావి నుంచి కాపాడిన లక్ష్మికి (జయప్రద) అర్థాంగి స్థాన మిచ్చిన ఉదార పురుషునికిది తగదు - అని హితవు చెబుతాడు. అతని మాట, భార్యలక్ష్మి చెప్పిన సలహా పాటిస్తూ, పరమ నీచుడైన ఆదిశేషుకి తన చెల్లెలు సీత నిచ్చి మహా వైభవంగా పెళ్లి జరిపిస్తాడు - పంపకాల సమయాన, ఆధునిక మంథర (రాజసులోచన) కుయుక్తి ఫలితంగా ఇంటి ఆడపడుచువైన ఏడు వారాల సొమ్ములూ స్వయానా బావగారి (సత్యనారాయణ)వల్ల మాయమవడం తెలుసుకు, వాటికి ముదరాగా తన యావదాస్తి చెల్లెలు పేర దస్తావేజు రాసిస్తాడు. ఇక, మిగిలింది పూర్వీకులు కట్టించిన భవంతి ఒక్కటే. అది కాస్తా సహకార బ్యాంకుకి తనఖా పెట్టి బ్రిడ్జి కాంట్రాక్ట్ ధరావత్తు కోసం పది లక్షలు సత్యానికి, అప్పు యివ్వగా, ఆ పది లక్షలు కాజేసి సత్యాన్ని చంపిస్తాడు ఆదిశేషు. అప్పటికే తమ్ముడు రవీంద్ర (రమేష్) లాయరైవున్నాడు - భానుమూర్తి (గొల్లపూడి) వద్ద జూనియర్‌గా ! ఆదిశేషు పెత్తండ్రి కూతురు మీనాక్షితో (మీనా) ప్రేమ కలాపం.... మిగతాది ఊహించుకోవచ్చు........ శ్రీరాముడు, ధర్మరాజు. హరిశ్చంద్రుడు, శిబి చక్రవర్తి, దధీచి వంటి వారితో పోల్చి పాట కట్టనంత మాత్రాన ఈ 'కలియుగ కరుడు' దానకర్ణుడు కాలేడు. ఉచితానుచితాలూ, ధర్మాధర్మాలూ, యోగ్యతా



'శ్రీకృష్ణలీలలు' చిత్రంలో సినీ ప్రపంచాన ప్రవేశించి, 'సంసారం', 'దాసి' మున్నగు చిత్రాలతో నిర్మాత'గా స్థిరపడి, 1964 నాటి 'నర్తనశాల'తో యావద్భారత గుర్తింపు పొందిన లక్ష్మీరాజ్యం, శోకరస, కరుణరస పాత్రల పోషణలో అద్వితీయురాలు. శ్రుతిలయలు' నిర్మాతలలో ఒకరైన అడ్వొకేట్ కరుణాకర్ ఆమె మేనల్లుడు. బంధుప్రీతి, స్నేహ చింతన గల ఆ మహానటి తెలుగు సినీ రంగానికి మణిపూసల వంటి చిత్రాలు సమర్పించిన ఆ ప్రముఖ నిర్మాత 1987 నవంబరు 25వ తేదీన కన్ను మూశారు. భర్త శ్రీధరరావుకు, కుటుంబ సభ్యులకు మా హృదయపూర్వక సానుభూతి తెలియజేస్తున్నాము.

యోగ్యతలు తెలుసుకు యిచ్చినప్పుడే అది దానమవుతుంది. భూసురరూపంతో వచ్చి దేవేంద్రుడే తన కవచకుండనాలు అర్థిస్తున్నాడేమోనని కర్ణునికి లీలగా తెలుసు. స్వర్గలోకాధిపతి తనవద్ద యాచకుడై నిలబడటంకంటె ఘనత ఏమున్నదని. వాటిని సమర్పించి దాన కర్ణుడయాడు. పాండవులు తన ఏకోదరులని తెలిసి కూడా ధర్మం తప్ప వాడు అతనొక్కడే .... శరచ్చంద్ర ప్రసాద్ పాత్రలో నాయకత్వ లక్షణం కంటె చేతగానితనమే ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.... వియత్నామ్ వీడు సుందరం కథ పరుచూరి బ్రదర్స్.... సంభాషణలు: దర్శకత్వం: కృష్ణ.... నిర్మాత: కాశీవిశ్వనాధరావు.

## కృష్ణచిత్రా వారి ఇన్‌స్పెక్టర్ ప్రతాప్

ఈ చిత్రంలో బాలకృష్ణ హీరో; విజయశాంతి హీరోయిన్ (ఈమెకి రెండుపేర్లు; టీకొట్టు అమ్మాయి చుక్క; దగాపడ్డ సోదరుని చెల్లెలుగా శాంతి); హీరో అన్నగారైన పబ్లిక్‌ప్రాసిక్యూటర్ (గొల్లపూడి), విలన్ విశ్వరూపంతో (సత్యనారాయణ) చేతులుకలిపి, వక్ర మార్గాన ధనసంపాదన గావించే కుటిలనీతిపరుడు. విశ్వరూపా ఫార్మస్యూటికల్స్ తయారు చేసిన మందు వేసుకోవడంవల్ల క్రాంతి (శరత్‌బాబు) భార్య మరణిస్తుంది. అదే మందుల కంపెనీలో పనిచేస్తున్న ఈక్రాంతి, తన యిద్దరు సహచరులతో యజమానిపై తిరగబడ్డ కారణాన, ఆ ముగ్గురు చట్టం దృష్టిలో నేరస్థులుగా ముద్రపొంది అడవులపాలవుతారు; క్రాంతియుతంగా ఈ ముగ్గురు గుర్రపు ముఠాగా సంఘానికి దూరంగా ఉంచడం విశ్వరూపం స్కీములో ఒక భాగం. ఐశ్వర్యవంతులు పోలీసు బలగాన్నీ, న్యాయ వ్యవస్థనీ ఎలా కొనెయ్యగలుగుతున్నారో చూపాలనే ఈ ఫార్ములా చిత్రంలో విజయశాంతి బాలకృష్ణల నటనావైదుష్యంతప్పసామాన్యప్రేక్షకునిమెప్పించ గల అంశాలుగాని, నవ్యతగాని లేవు. సంగీతం బాగుంది, నాటకీయ సందర్భాలు వున్నాయి; మోటారుసైకిలు పోటీదాకా ఎక్కడా విసుగనిపించదు: అయితే కథా బలం మాత్రం లేదు. దర్శకత్వం: ముత్యాల సుబ్బయ్య; నిర్మాత: అనిల్‌బాబు. సమర్పణ; హరికృష్ణ.



కాపిటలిజమ్‌లో గల దుర్గుణం ఏమిటంటే, ఆశీర్వాదాలు అసందర్భంగా పంచుతుంది. సోషలిజంలో గల సుగుణం ఏమిటంటే కష్టాలు సమంగా పంచుతుంది. —విన్‌స్టన్ చర్చిల్

కాలిబాట లేని అడవులలో ఆనందం వుంది; ఒంటరితీరాన వేకువకాంతి వుంది; సముద్ర గర్జనలో సంగీతం వుంది; అందుకని ప్రకృతి ప్రేమించి మనిషిని తక్కువ చేయును.



ఆదూర్ గోపాలకృష్ణన్

# 'స్వయంవరం' నుంచి 'అనంతరం' వరకు

సరోజినీ ప్రేమ్‌చంద్

భారత చలనచిత్ర రంగంలో నవ చైతన్యం వెల్లి విరుస్తున్నది. సత్యజిత్ రే, మృణాళ్ సేన్, రిత్విక్ ఘటక్ మొదలైనవారు మార్గదర్శకులు కాగా కొత్త తరానికి చెందిన అరవిందన్, గోవింద నిహలానీ, గౌతమ్ ఘోష్, ఆదూర్ గోపాలకృష్ణన్, విజయమెహతా మున్నగువారు తమ ప్రత్యేక ధోరణులలో చిత్రాలను నిర్మించి 'ది న్యూ యిండియన్ సినిమా' ను సుస్థిరమూ, సుసంపన్నమూ చేస్తున్నారు.

'87 డిసెంబరు మొదటివారంలో 'ఫ్రేమ్స్' అనే ఔత్సాహిక సంస్థ ఆదూర్ గోపాల్ కృష్ణన్ చిత్రాలను అయిదింటిని 'దర్శకుని పునరావలోకనం' (A Director's Retrospective) గా ప్రదర్శించారు.

"స్వయంవరం" (1972) .... గోపాలకృష్ణన్ తీసిన 'స్వయంవరం' లో సీత, విశ్వం ఒకరినొకరు కోరుకొని పెద్దవారి ప్రమేయం లేకుండా పెళ్ళిచేసుకుంటారు.

డబ్బు అయిపోగానే కలల వెలుగు ఆరిపోయి వాస్తవికతను ఎదుర్కోవలసివస్తుంది. కథలూ, నవలలూ రాసి జీవనం గడుపుకోవచ్చునను కుంటాడు విశ్వం. కాని, రచయితగా ఆదర్శ జీవితం గడపాలనుకోవడం ఎంత అసాధ్యమో త్వరలోనే తెలిసి వస్తుంది. ఒకటి రెండు నెలలు ట్యుటోరియల్ కాలేజిలో వుద్యోగం - అది పోయాక కలపవ్యాపారి వద్ద క్లర్కుగా ప్రవేశిస్తాడు. కూలిపోతున్న పాత యింటిలో కాపురం, రకరకాల యిరుగూ పొరుగూ, అలవాటులేని పేదరికం వారిని బాధిస్తున్నా, ఒకరిపై మరొకరికి గల అనురాగం యివన్నీ తట్టుకొనే శక్తిని యిస్తుంది. ఒక కూతురు కలుగుతుంది. ఇంతకు ముందు విశ్వం స్థానంలో పనిచేసి వుద్యోగం పోగొట్టుకున్న వ్యక్తి పదే పదే అతనికి ఎదురుపడటమూ తనకు అన్యాయం జరిగిందని చెప్పడమూ విశ్వంలో ఒకరకమైన అప రాధ భావాన్ని కలిగిస్తుంది. క్రమంగా

జీవితంలో ఆదర్శాల రంగులు మాసి పోయి నిత్య పోరాటపు వేదనే మిగులు తుంది. విశ్వం జబ్బుచేసి మరణి స్తాడు. తల్లిలాగా కనిపెట్టి వున్న జానకి, సీతని ఆమె తల్లిదండ్రుల వద్దకు తిరిగి వెళ్ళమంటుంది. ఆత్మాభిమానం గల సీత అందుకు ఒప్పుకోదు. వ్యభి చారంతో తననీ, భర్తనీ పోషించు కునే కళ్యాణి ఒక పక్కన, స్మగ్లింగ్ గూండాలూ మరొక పక్కన వుండే యీ సమాజంలో సీత, ఆమె కూతురు ఎట్లా బతుకుతారు ? నిరాశ, నిస్పృహ లకు లొంగిపోకుండా పరిణతి చెందుతూవస్తున్న వ్యక్తిగా కనిపిస్తుంది సీత. విశ్వం మరణించినా అతని ఆదర్శాల అడుగు - జాడలు విడనాడదు. ☼

'కొడి ఏటమ్' (1977)లో నేపథ్య సంగీతం లేనే లేదు. పిట్టల అరు పులూ, పల్లెటూళ్ళో సహజంగా విన బడే ధ్వనులూ యివే చిత్రమంతా ఆయాసన్నివేశాలకు తగిన 'మూడ్స్'ను సృష్టిస్తాయి.

ఊరి ఆలయంలో వుత్సవం. ధ్వజ స్తంభం పైకి పతాకాన్ని ఎక్కిస్తూ వుంటారు. కొడి ఏటం అంటే అర్థం అదే ! ఆ దృశ్యంతో ఆరంభమవు తుంది. చీకూచింతాలేని శంకరన్ కుట్టి ఆ పండుగలో వుంటాడు. అత నికి చదువులేవు ; స్థిరమైన పనిలేదు. ఊళ్లో చిన్న పిల్లలతో గాలిపటాలు ఆడతాడు. రూపాయో అర్థో యిచ్చి ఎవరయినా పని చెప్తే అది చేస్తాడు. తాగిస్తే తాగుతాడు. దయతలిచి అన్నం పెడితే పరమ సంతోషంతో తింటాడు. అక్క సరోజిని పట్నంలో పనిచేస్తూ, అప్పుడప్పుడు వచ్చి యితని గురించి కనుక్కుంటూ వుంటుంది. కమలమ్మ అంటే కుట్టికి అభిమానం. ఆమెకీ వూరి లోని పెద్ద మనిషికీ వున్న రహస్య బాంధవ్యాన్ని వింతగా పరికిస్తూ వుం టాడు.

పెళ్ళి చేస్తే కుదురుగా వుంటా డేమోనని అక్క సరోజిని అతని పెళ్ళి జరిపిస్తుంది. భార్య శాంతమ్మ చూపే అనురాగానికి శంకరన్‌లో స్పందన కనబడదు. ఏ గుళ్ళోనో పండగని ఆ వూరూ ఈవూరు తిరుగుతూ వుంటాడు. గర్భవతి అయిన శాంతమ్మను తల్లి పుట్టింటికి తీసుకెళుతుంది.

ఎట్లా అయితేనేం, ఒక లారీ డ్రయి వర్ వద్ద క్లీనర్‌గా వుద్యోగం సంపాది స్తాడు కుట్టి. కాని ఒళ్ళు వంగక అదీ మానేసి యింటికి తిరిగి వస్తాడు. కూతురుని చూసి ముచ్చట పడతాడు. అత్తగారు అతని నిలకడలేని తనాన్ని నిందిస్తుంది ; భార్య అతనితో కలిసి జీవించడానికి యిష్టపడదు. అక్క సరోజిని పెళ్ళి చేసుకొని తన యిం టినీ, భర్తనీ చూసుకోవడంలో మునిగి వుంటుంది. ఇలా ఘోండగా కమలమ్మ ఆత్మహత్య కుట్టిని ఆవేదనలో ముంచుతుంది. ఈసారి పట్టుదలతో పాతలారీ డ్రయివరు దగ్గిరే క్లీనర్‌గా చేరి అనుభవం గడిస్తాడు. లారీలో తిరు గుతూ జీవితాన్ని చూస్తున్నకొద్దీ శంకరన్ కుట్టిలో మానవత్వం, మమత,

బాధ్యత క్రమంగా కలుగుతాయి. మళ్ళీ గుళ్లో వుత్సవం జరిగే సమయానికి కొత్త మనిషిగా తిరిగివచ్చి శాంతమ్మనీ, కూతురినీ వాత్సల్యంలో చేరదీసుకుంటాడు.

కుట్టి, ఎడ్లబండిలో హాయిగా పడుకొని ఆ కదలికకు నిద్రపోతూ వుంటాడు. బండివాడు ఒక పాట-పాతదే పాడుతూ వుంటాడు. "జీవితం మాయ. కష్టాలకూ, సుఖాలకూ చలించని వాడే గొప్ప మనిషి" అని! ప్రేక్షకులకు నవ్వూ, జాలీ రెండూ కలుగుతాయి. నిర్వేదం గొప్ప ఫిలాసఫీ కావచ్చు కానీ సమాజంలో బతకవలసిన మనిషి అన్ని స్పందనలూ పొందుతూ అందరితో ప్రేమ పూర్వకమైన బాంధవ్యాలు నిలుపుకుంటూ బాధ్యతాయుతంగా జీవిస్తున్నప్పుడే అతని బ్రతుకుకు గమ్యమూ, అర్థమూ వుంటాయి. శంకరన్ కుట్టిలో వచ్చిన యీ పరిణతే 'కొడి ఏటమ్' ప్రధాన కథ.

'ఎలిపత్తియ్యం' (1981) అంటే ఎలుకబోను. పరిమితి మించిన భూములను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం, వ్యక్తి స్వేచ్ఛకు తగు ప్రాధాన్యత యివ్వడం యీ మధ్య కాలంలో, సంఘంలో వచ్చిన మార్పులు. మధ్య వయసు దాటిన 'వున్ని' మాత్రం యింకా పాతకాలపు ఫ్యూడల్ భావాలలోనే వుంటాడు.

ఒకప్పుడు గొప్పగా బతికినా ప్రస్తుతం తిండికీ, బట్టకూ సరిపడేంత ఆస్తి మాత్రమే మిగులుతుంది - 'వున్ని'



ఎన్నో చిత్రాలలో ఉపనాయికగా నటించి, కథానాయిక కానున్న శిరీష



కుటుంబానికి. పెద్ద చెల్లెలు జానమ్మ తన భర్తా, పిల్లలతో కాపురం చేసుకుంటూ వుంటుంది. రెండో చెల్లెలు రాజమ్మ, పెళ్ళి కాని అన్నను, కాలేజిలో చదువుతున్న చెల్లెలు శ్రీదేవిని కనిపెట్టుకొని వుంటుంది. ముప్ఫయ్యేళ్ళు దాటిన రాజమ్మకు మంచి సంబంధాలు ఎన్నో వచ్చినా ఆస్తి పంచి యివ్వవలసి వస్తుందని 'వున్ని' ఏదీ పడనివ్వడు. ఎంత స్వార్థపరుడంటే రాజమ్మకి ఒంట్లో అస్వస్థతగా వున్నా అర్ధరాత్రి వేళ లేచి అతనికి వేడినీళ్ళు కాచవలసిందే; చన్నీళ్ళు అతనికి పడవు.

పాతబడిన ఆ యింట్లో ఎలుకల బాధ భరించలేక బోనులో ఎలుకలని

పట్టుకుంటూ వుంటారు. శ్రీదేవి రోజూ యీ ఎలుకలని చెరువు నీటిలో ముంచుతూ వుంటుంది. ఈవిధంగా ఎలుకల ప్రస్థానం జరుగుతూ వుంటే, అటు శ్రీదేవి కొత్త జీవితాన్ని వెతుక్కుంటూ తను ప్రేమించిన యువకునితో వెళ్ళిపోతుంది. జానమ్మ తన వంతు ఆస్తి పంచమని వత్తిడితెస్తుంది. 'ఉన్ని' ఆస్తిలో వారికి భాగమూ యివ్వడు, వారి దుఃఖాలలో పాలూ పంచుకోడు. రాజమ్మలోని మంచితనం ఆమెని తిరగబడనివ్వదు కానీ అంతరంగములోని బాధవలన జబ్బున పడి మరణిస్తుంది. ఉన్ని ఎలుక కలుగులో ఉన్నట్లుగా తనలో తను మునగదీసుకొని పరిస్థితులనుండి తప్పించుకుందామనుకుంటాడు. గ్రామస్థులు అతనిని పట్టి బంధించి వూరి చెరువులో ముంచి 'షాక్ ట్రీట్‌మెంటు' యిస్తారు. మారుతున్న విలువలు గ్రహించలేని వ్యక్తికి సమాజమే 'విముక్తి' ప్రసాదిస్తుంది. 'విముక్తి' బాధాకరంగా లేకుండా వుండాలంటే వ్యక్తి తనం తట తనే మారకతప్పదు, అని చెబుతుంది యీ చిత్రం. ❋

ఒక వ్యక్తి అంటే అతను అనుసరించే సిద్ధాంతాలేనా ? లేక, అతనిలో యింకో వ్యక్తిత్వం కూడా వుంటుందా ? ఇటువంటి సందేహాలు మనలో కలిగించే శ్రీధరన్ నాయర్‌తో మనకు పరిచయం అయేది, అతను తెలిసిన వ్యక్తుల సంభాషణల ద్వారా, ఫోటోలు గత సంఘటనల నెమరువేతల ద్వారా మాత్రమే. కమ్యూనిస్టు పార్టీ నాయకుడైన శ్రీధరన్, ఫ్యాక్టరీ కార్మికుల పక్షాన మేనేజ్‌మెంటుతో పోరాడుతూ వుంటాడు. అతని ఆదర్శాలు, మనో నిబ్బరమూ, నిస్వార్థమూ చూసి అందరూ అతన్ని అభిమానిస్తారు. ఎన్నో ఆశలు పెంచుకుంటారు. ఫ్యాక్టరీ స్వంతదారు హత్య జరుగుతుంది. శ్రీధరన్ మీద కూడా అనుమానం రావడంవల్ల అతను అండర్ గ్రవుండ్‌లోకి వెళ్ళిపోతాడు.

పదేళ్ళ తరువాత శ్రీధరన్ తిరిగి వస్తాడు. అయితేయీ వ్యక్తికీ మునుపటి నాయకునికీ పోలికలే వుండవు. త్రాగుడు, నిరంతరమైన అలసటా, వర్తమాన, రాజకీయాల్లో నిరాసక్తి— అతను ఇతనేనాఅనిపిస్తాయి. అప్పటికే కమ్యూనిస్టు పార్టీలో చీలిక జరిగింది. రెండు పక్షాలూ తమతో చేరమని ఒత్తిడి చేస్తాయి. ప్రియశిష్యుడు 'సుధాకరన్' లక్ష్యనిర్దేశం' చేయమని ఆక్రోశిస్తాడు. తనతండ్రి గొప్పహీరోఅనుకున్న పదేళ్ళకొడుకులో చెప్పలేని నిరాశ.

కార్మికుల సమస్యలు అట్లాగే వున్నాయి. సమాజంలో హెచ్చుతగ్గులూ అట్లాగే వున్నాయి. ఇటువంటి వాతావరణంలో ఒకనాటి అర్థరాత్రి ఎవరో అతనిని హత్యచేస్తారు. అతని శవానికి మళ్ళీ సకల మర్యాదలూ; పార్టీనాయకుని హోదా యిచ్చి ప్రజలు జైజై లు కొడుతుండగా సినిమా ముగుస్తుంది.

శ్రీధరన్ నాయర్ తన కర్తవ్యం నిర్వహించలేదా ? ఓడిపోయినది

అతనా పార్టీయా? ఎక్కడి నుండో వచ్చిన శ్రీధరన్ నాయర్, సమాజాన్ని వుద్ధరించాలనుకోవడం ప్రజలఆత్మ్యాశా? చైతన్యమూ నాయకత్వమూ అయా ప్రజలలో నుండే రావాలా అనే, రకరకాల ప్రశ్నలూ సందేహాలూ ప్రేక్ష కులలో కలిగించి వదలివేస్తుంది. కేరళ లోనూ యింకా కొన్నిచోట్ల వాద వివాదాలకి లోనయింది 'ముఖా ముఖం (1984). ఆలోచనాపరులు చర్చించవలసిన 'వస్తువు'గల చిత్రమిది.

☼

ఆదూర్ గోపాలకృష్ణన్ చిత్రాలు మానవ అనుభూతుల పరిమళాలు వెదజల్లుతాయనీ, జీవితానుభవాలను మానవత అనే భాష ఆధారంగా దృశ్యీకరిస్తాడు అనీ విమర్శకుల అభిప్రాయం. అందుకు నిదర్శనంవలె వుంటుంది 'అనంతరం' (1987).

అజయన్ తన జ్ఞాపకాలనుండి నిర్మి స్తూ స్వాగతంవలె కథను ప్రేక్షకులకు చెప్తాడు. సినిమా రెండో సగంలో యిదే కథను తను యింకొక మానసిక స్థితిలో వున్నప్పుడు మళ్ళీ చెప్తాడు. అజయన్ చాలా తెలివైన కుర్రవాడు. చెరువు మెట్లమీద ఆడుకుంటూ మెట్లను ఒకసారి 1,3,5,7,.........27అనీ, యింకోసారి 2,4,6,8........28అనీ లెక్కిస్తున్నట్లు ఒకసన్నివేశం వుంటుంది. వాస్తవ సంఖ్య యీ రెండూ కాదు. వీటి మధ్యన వుంటుంది. అదేవిధంగా అజయన్ చెప్పిన రెండు తరహా కథలనుంచి సారాంశాన్ని మనం గ్రహించాలి.



వైవిధ్యం గల పాత్రలలో, పాత్ర స్వభావం అర్థం చేసుకు, నటనలో లీనమై మెప్పిస్తున్న వెంకటేష్



అజయన్ పుట్టగానే తల్లి అతన్ని హాస్పిటల్‌లో వదిలేసి వెళ్ళిపోతుంది. అక్కడి డాక్టరు అజయన్‌ని ఆదరి స్తాడు. రిటైరయ్యాక తనతోపాటు యింటికి తీసుకువచ్చి ప్రేమతో పెంచుతాడు. డాక్టరు కొడుకు బాలూ కూడా తన స్వంత అన్నలాగా అజయ న్‌ని ఆప్యాయతతో చూస్తాడు. కానీ అజయన్‌లో తను ఎన్నడూ చూడని తల్లి అంటే అసహ్యం, ఆగ్రహం తనకే తెలియని ఏదో లోటు అతన్ని బాధిస్తుంది. పైగా అసాధారణమైన తెలివితేటల వల్ల కూడా అతనంటే టీచర్లకీ, పిల్లలకీ అయిష్టం ఏర్పడు తుంది. అందరూ తనని నిర్దాక్షిణ్యతతో చూస్తున్నారనీ, తనకి ఏవిధమైన కుటుంబ బంధాలూ లేవనీ అనుకుంటూ

వుంటాడు. ఇది డాక్టరు మరణంతో మరింత ఎక్కువవుతుంది.

'బాలు వివాహం అయి 'సుమ' రావడంతో అజయన్‌లో కొత్త సంఘర్షణ తలఎత్తుతుంది. 'తనతప్పుని సమర్థించుకోవడానికా అన్నట్లు 'సుమ' లాగే వుండే 'నళిని'తో తనకు బస్సుస్టాపు వద్ద పరిచయం, స్నేహం, కలిగినట్లు చెప్పుకుంటాడు. క్రమంగా వాస్తవమేదో కల్పన ఏదో విచక్షణ లేని స్థితిలోకి జారిపోతాడు. అగాధమైన చీకటి గుహల వంటి మానసిక ప్రపంచపు లోతులలోకి పడిపోతాడు అజయన్.

ప్రదర్శన తర్వాత, చర్చలో పాల్గొంటూ ఆదూర్ చెప్పినట్లుగా 'సబ్జక్టివ్ రియాలిటీ' ఆధారంగా కథ చిత్రీకరించబడింది. సాధారణ సినిమాల్లో వుపయోగించేది 'ఆబ్జక్టివ్ రియాలిటీ'. అంటే ప్రేక్షకులు ఏమీ ఆలోచించనవసరం లేకుండా కథ అంతా వరుసక్రమంలో ఎవరు ఏమిటి ఎందుకు అనే ప్రశ్నలకు సూటిగా జవాబు చెప్పుకుంటూ సాగిపోతుంది.

'ముఖాముఖం', 'అనంతరం' చిత్రాలు చర్చలకు ప్రేరణ కలిగించాయి.

'ఎలిపత్తియం' ఆదూర్ సృజనాత్మకతకు పరికాష్ఠ అనీ, సినిమా కళనూ, సమాజ వాస్తవికతనూ నైపుణ్యంతో సమ్మేళనం చేసిన 'మాస్టర్ పీస్' అనీ పలువురు అభిప్రాయ పడ్డారు. కొడి ఏటమ్‌లో శంకరన్‌కుట్టి పాత్రకు అనేక ప్రశంసలు లభించాయి.

ప్రతి చిత్రంలో వస్తువును ఎన్నుకోవడంలో కొత్తదనం, చిత్రాన్ని చూసి ఆనందించడానికి భాష ఏవిధంగానూ అడ్డురాకపోవడం గమనించదగ్గవి. అతి సాధారణమైన నిత్యజీవితాన్ని చిత్రిస్తూనే వున్నతమైన కావ్య గుణాలను సంతరించుకోవడం యీ దర్శకుని ప్రత్యేకత. కెమేరాతో కవిత్వం అల్లుతారు.

'ఫ్రేమ్స్' సంస్థ వెనకాల వున్నది యిద్దరు యువతుల వుత్సాహం. కుమారి జయప్రియ, శ్రీమతి సారిక, ఉత్తమ చిత్రాలను పదిమందికీ చూపాలనే మంచి వుద్దేశ్యంగలవారు. త్వరలోనే ప్రపంచ ప్రఖ్యాత దర్శకుడు ఐసెన్‌స్టీన్ చిత్రాల ప్రదర్శనకు గాను ఏర్పాట్లు జరుగుతున్నాయి. కేరళలో 1965 లోనే 'చిత్రలేఖ' అనే పేరుతో వుత్తమ విలువలు కలిగిన చిత్రాలు చూసే ప్రేక్షక సంఘాలు ఏర్పడి కొత్తతరం నిర్మాతలకూ, దర్శకులకూ ప్రోత్సాహాన్నిచ్చాయి. మన ఆంధ్రాలో కూడా హీరోలకు అభిమాన సంఘాలు కాకుండా, మంచి సినిమాలకు అభిమాన సంఘాలు అధిక సంఖ్యలో రావాలి.



నా గురించి మీకంతగా తెలీదు. అట్లాంటిక్ మహాసముద్రంలో తిమింగలాల వేట కెళ్ళినప్పుడు, మెరుపులతో తలగోక్కుంటాను. ఉరుముల జోలపాటతో నిద్రపోతాను.

— మార్క్‌ట్వేన్



# డైరీ

## 1988 జనవరి 01

జనవరి ఒకటో తేదీ ఉదయం, పతిసంవత్సరానికి మల్లేనే, నవతా క్రృష్ణంరాజు ఆఫీసులో పూతరేకులూ పులిహోరా, ఉప్మా వడలతో బ్రేక్ ఫాస్ట్. పత్రికా మిత్రులంటే ఆయనకి ప్రత్యేకాభిమానం ........ ఆ తర్వాత ఎవియమ్‌లో అన్నపూర్ణా సినీచిత్రవారి (వసుధా చిత్ర ప్రసాద్) కొత్త పిక్చర్‌కి ముహూర్తం, హీరో సుమన్‌పై చిరంజీవి క్లాప్; సురేష్‌రెడ్డి కెమెరా స్విచాన్.... పరస్పర నూతన సంవత్సర శుభాభినందనలు. సాయింత్రం నాలుగు గంటలకి సురేష్ మహల్‌లో ఉషా 'ఆర్ట్‌వారి (నిర్మాత: అశోక్‌కుమార్) రక్తతిలకం' ప్రెస్‌మీట్, పాటల ప్రదర్శన. పిక్చరంతా పూర్తయింది - తొందరలో నేరిలీజు కానున్నది. హీరో వెంకటేష్ ఈపిక్చర్లో ఎంతో అందంగా గంభీరంగాకనిపిస్తున్నాడు. దర్శకత్వం గోపాల్; నిర్మాత రామానాయుడు 88లో రానున్న తమ చిత్రాల గురించి ప్రస్తావించారు. బ్రహ్మపుత్రుడు, రైతు రాజ్యం మున్నగువాటిలో వెంకటేష్‌ని మనం చూస్తాము..... తర్వాత మజిలీ సవేరా... భానూ ఆర్ట్ క్రియేషన్స్ వారు విశ్వనాధ్ దర్శకత్వంలో 'స్వర్ణకమలం' నిర్మిస్తున్నారు. లాన్‌లో పార్టీ. సంగీత ఝరి ప్రవహిస్తున్నట్లుగా వినిపించాయి పాటలు — మ్యూజిక్ : ఇళయరాజా ఆ కాసెట్ యిస్తారేమో అనుకున్నారు యిద్దరు ముగ్గురు పత్రికలవారు. అక్కడ 'రక్తతిలకం' లోను యిక్కడ 'స్వర్ణకమలం' లోను రెండింటిలోనూ వెంకటేష్ ! 'నటనాకౌశలం పట్ల వినమ్రతతో, ఆ విద్యలో విశిష్టత నందుకోవాలనే తపనతో, ఈ వ్యాసంగంలోకి వచ్చాడు - పాశ్చాత్య ప్రభావంలో పెరిగిన వెంకటేష్. ఇతనికి కావలసినది డబ్బు కాదు— కోటీశ్వరుని కుమారుడు; తనుచేబట్టిన కళలు ఉన్నతస్థాన మందుకోవాలని అతని తపన'— అని కళాశిల్పి విశ్వనాధ్ మెచ్చుకోవడం, వెంకటేష్‌కి ఒక గొప్ప ఆశీర్వాదం. .. 'స్వర్ణకమలం' లోని కధానాయకుడు, సినిమా బానర్లు (హెూర్డింగ్స్) రాసే ఒక చిత్రకారుడు. కధానాయిక భానుప్రియ, ఒక బీద నాట్యాచార్యుని రెండో కూతురు, పెద్ద కూతురికి సంగీతం, రెండో కూతురికి నాట్యం చెప్పించాడు. ఆ పేద కుటుంబీకుడు. పెద్దమ్మాయి తండ్రిని

అంతగా తప్పు బట్టదుగాని ఓ రెండో అమ్మాయి 'తిండిపెట్టలేని ఈ విద్య ఎందుకు నేర్పించినట్లు?' అని విసుక్కుంటూ వుంటుంది......... కళకు పరమార్థం ఆర్థిక ప్రయోజనమా? కాదు, ఆత్మసంతృప్తి: అది మాటలలో చెప్పినంత తేలికకాదు. అసంతృప్తి నందుకోగల సాధనే ఈ చిత్రకథా యితివృత్తంగా పేర్కొన్నారు— తనది ఖాదీ క్రాఫ్ట్ అని చెప్పిన విశ్వనాథ్.... పి ఆర్ ఒ: అర్జునరావు.

..... 03

'అల్లీ బిల్లీ అల్లరి మల్లెల రేయి - మళ్లీ మళ్లీ వస్తుందా ఈ హాయి' పాటను (సీతారామశాస్త్రి రచన;

---

As Prescribed in the Registration of Newspapers (Central Rules 1956)

## STATEMENT ABOUT OWNERSHIP OF 'JAGATI' (Telugu)

| | |
|---|---|
| 1. Place of Publication | 2, Kutchery Road<br>Madras - 600 004 |
| 2. Periodicity of its Publication | Monthly |
| 3. Printer's Name<br>Whether citizen of India?<br>Address | N. R. Chendur<br>Yes<br>2, Kutchery Road<br>Madras - 600 004 |
| 4. Publisher's Name<br>Whether citizen of India?<br>Address | N. R. Chendur<br>Yes<br>2, Kutchery Road<br>Madras - 600 004 |
| 5. Editor's Name<br>Whether citizen of India?<br>Address | N. R. Chendur<br>Yes<br>2, Kutchery Road<br>Madras - 600 004 |
| 6. Names & addresses of individuals who own the Newspaper | N. R. Chendur<br>Sole Proprietor<br>2, Kutchery Road<br>Madras - 600 004 |

I, N. R. Chendur, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

29th Feb. 1988

N. R. CHENDUR
Signature of Publisher

నాగూర్ బాబు, చిత్రల గాత్రం అర్జున్ సీతూలపై చిత్రీకరించారు- పద్మజ విజయలక్ష్మి వారి 'డాక్టరు గారి అబ్బాయి' పిక్చర్‌లో. జొన్న విత్తుల పాటని చిత్రపాడగా 'నాపేరే మొనీషా — నా ముద్దే బాదుషా హాపీగా లవ్ చేశా — నీకోసం లైనేశా' అంటుంది డిస్కో శాంతి. రామకృష్ణంరాజు సమర్పింపగా, రామరాజు నిర్మిస్తున్న ఈ చిత్రానికి దర్శకులు పి యన్ రామచంద్రరావు. యమ్‌యమ్ థియేటర్‌లో ఈ ఉదయం పాటలు చూపారు, పి. ఆర్ ఒ : జగన్.

. . . . . 05

'దొంగగారూ స్వాగతం' నిర్మాత అబ్బులు, ఈ మధ్యాహ్నం వారి ఆఫీసులోలంచ్ ఏర్పాటు చేసి, ఆ పిక్చర్ విడుదలకు సంబంధించిన సాధకబాధకాలు, కష్టసుఖాలు చెప్పారు. మొదట నుంచీ పత్రికలవారు తనపట్ల ఎంతో అభిమానం చూపుతున్నారనీ వారిచ్చిన పబ్లిసిటీయే తన చిత్ర విజయానికి హేతువు అనీ ఆ సందర్భంగా తన సంతోషం వ్యక్తంచేసేందుకే ఈ సమావేశమనీ అన్నారు నిర్మాత అబ్బులు. పి ఆర్ ఒ : రాజు.

06

గౌతమ్ బజాజ్‌ని1985అక్టోబరులో వార్ధా సమీపానున్న పౌనార్‌లోని వినోబాభావె ఆశ్రమం చూడటానికి వెళ్లినప్పుడు కలుసుకున్నాను. పదిపన్నెండు రోజుల క్రితం ఆయన వద్ద నుంచి ఉత్తరం వచ్చింది - సిస్టర్ సుజాత



తమిళ చిత్ర రంగంలో విజయం పొంది, తెలుగులోకి పునఃప్రవేశం గావిస్తున్న సురేష్

పెయింటింగ్స్ ఎగ్జిబిషన్ సరళా ఆర్ట్ సెంటర్లో ఏర్పాటు చేస్తున్నారని! గౌతమ్ బజాజ్ మద్రాసు వచ్చినప్పుడు. అచ్యుత్ పట్వర్ధన్‌తో థియోసాఫికల్ సొసైటీలో ఉంటారు. క్రితంసారి ఆయన మద్రాసువచ్చినప్పుడు నేను ఏదో టూర్‌లో ఉండడంవల్లకలుసుకోలేకపోయాను కొందరు వ్యక్తులతో గడిపినది కొద్ది నిముషాలే అయినప్పటికీ ఆ అనుభూతి ఎన్నటికీ చెరగని బాంధవ్యంలా మిగిలిపోతుంది. అటువంటి ఉన్నతాత్ములూ దీక్షా దక్షులూను గౌతమ్ బజాజ్.... క్షీరాబ్ధి కన్యకకు.... అంటూ శుభవాచకంతో సుజాత పెయింటింగ్స్ ప్రదర్శనకు దీపారాధన గావించారు యమ్మెస్‌సుబ్బలక్ష్మి. ఆతర్వాతమీరా

భజన ఒకటి పాడారు.... ఆ చిత్రాలను మనోముద్రితం చేసుకోవడం తప్ప స్పీచెస్ లేవు. ప్రతిపటంలోను ఆ కళాకారిణి హృదయగానం రేఖలూ రంగులూగా కనిపిస్తుంది. నాబొమ్మల్లోని తలుపులు, కిటికీలు, మెట్లు, గోడలు, చెట్లు చేమలూ, నా అంతర్గతమనో భావాలను, ప్రేరణలను వ్యక్తంచేసే ఉపకరణాలు. ఆ ఆకృతులలోది స్త్రీత్వం శైశవ గీతిక. ....వెనకొకసారి 'నిరీక్షణ' వరసగా చిత్రాలలో చూపించాను; ఇప్పుడు 'సంఘర్షణ' చూబుతున్నాను. పోరాటం లేనిదే ప్రగతి లేదు- అంటారు సుజాతా బజాజ్ . . . బిఎ, ఎమ్ఎలు ఫస్ట్‌క్లాస్‌లో పాసయిన ఈ చిత్రకారిణి, మహారాష్ట్ర ప్రభుత్వ బహుమతి పొందడమేగాక గతపదేళ్లలో పూనె, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, బెంగుళూరు, మద్రాసులలో తన చిత్రకళా ప్రదర్శనలు ఏర్పాటు చేసారు. ఇండియన్ ట్రయిబల్ ఆర్ట్‌పై (INDIAN TRIBAL ART) డాక్టరేట్ పొందారు. రాజస్థాన్‌లోని భిల్లులు, మహారాష్ట్ర వార్లీలు, బస్తర్ మధ్యప్రదేశ్‌లలోని మురియాలు, ఒరిస్సాలోని సవరలు - యిటువంటి అదిమ తెగలెన్నో అమెన్వయంగా తెలుసుకొని వారి మధ్య కొన్నాళ్ళు జీవించి వారి కళాస్వరూపాలు మనోగతం చేసుకున్నారు. చిత్రకళా రూపాలే సౌందర్య దీపాలు అని భావించే సుజాత నుంచి నేటి యువచిత్రకారులు తెలుసుకోదగ్గది ఎంతైనా ఉంది.

. . . . . 08 .

'రేపు సాయింత్రం మీకు వీలుండకపోతే, యివ్వాళ నాలుగు గంటలకి యూనివర్శిటీ ఇంగ్లీషు డిపార్ట్‌మెంటులో మాట్లాడుతున్నారాయన' - అని వేణుగోపాలరావు ఉదయం ఫోనులో చెప్పివుండకపోతే, ఒక మంచి లెక్చర్ మిస్ అయివుండేవాణ్ణి. సాధారణంగా ఉపన్యాసాలు 'డల్'గా ఉంటాయి - కాని, ఒక సాహిత్య పరిశోధకుడు, తను శ్రద్ధగా పరిశీలించిన విషయం వివరించి చెబుతున్నప్పుడు, వినడం ఒక ఎడ్యుకేషన్. షికాగో యూనివర్సిటీకి చెందిన ప్రొఫెసర్ డేవిడ్ గ్రీన్ (Prof David Grene) షేక్స్పియర్ నాటకం, 'రిచర్డ్ ది సెకండ్' లో రిచర్డ్ పాత్ర, రాజరికాన్ని నాటకీయతతో ఎలా మిళితం చేసినదీ సోదాహరణంగా చెప్పారు- కజిన్ బోలింగ్ బ్రోక్‌కి, రాజుగారికీ జరిగిన సంభాషణలోని అంశాల ప్రొ॥ డేవిడ్ గ్రీన్ చెబుతున్నప్పుడు ఎన్నో ఉగాదుల వెనక్కి పరుగు తీసింది మనసు - రిచర్డ్ ది సెకండ్, షేక్స్పియర్ డ్రామాలలో ఒకటి మా కాలేజీ రోజులలో .... మాస్కోలోని బోల్షాయ్ థియేటర్ వారి సంగీత నృత్య నాటకాలకు షేక్స్పియర్ కొత్త ఊపిరినిచ్చాడు. ఇంచుమించు నాలుగు శతాబ్దులైనా, కాళిదాసూ భవభూతి మల్లే షేక్స్పియర్ నిత్యశోభితుడు.

. . . . . 13

కులపతి కెయమ్ మున్షీ శతజయంతి భారతీయ విద్యాభవన్ స్వర్ణోత్సవమూ సంయుక్తంగా భవన్ ఆడిటోరియమ్‌లో

నాకు చైత్రమాసమే' (వేటూరి గీతం - రాజ్‌సీతారామ్, సుశీల గాత్రం) అం టాడు నాయకుడు తన నెచ్చలితో, - వల పుల తొలకరికి పూలవేణుపుపలుకుతూ ....'కలెక్టర్ విజయ' చిత్రానికి మాటలు కూర్చినది మహారథి. సంగీతం; రమేష్ నాయుడు. స్క్రీన్‌ప్లే, దర్శకత్వం విజయనిర్మల ....పాటల ప్రదర్శన అయాక, విజయనిర్మల భవంతిలో నరేష్ బర్త్‌డే పార్టీ ....చిత్తూరు జిల్లా ఉప ఎన్నికల ప్రచారానికి వెళ్లి వచ్చిన కృష్ణ, రాజకీయ విశేషాలు కాసేపు చెప్పారు.

. . . . . 21

యాక్టర్ సురేష్ (గోపీనాథ్ కుమారుడు) ఇప్పటికి 74 తమిళ చిత్రాలలో నటించాడు. పోయిన సంవత్సరం వెలువడ ఎనిమిది తమిళ చిత్రాల లోను నాలుగు హిట్స్ నాలుగు ఫ్లాప్సనట- అతను చెప్పిన మాటే; జడగంటలు, జగమొండి, యస్ పి భయంకర్ మున్నగు ఏడెనిమిది తెలుగు చిత్రాలలో సురేష్ ఉన్నారు. 'నదియా - సురేష్'ల జంటని తమిళ ప్రేక్షకులు విపరీతంగా ఆదరించారు. అయితే, అదే వరవడి అనుసరించడం ఆర్టిస్టులుగా తమ భవిష్యత్తుకి శ్రేయోదాయకం కాదని, కొన్నాళ్లపాటు విడి విడిగా యాక్ట్ చేదామని అనుకున్నారుట. సురేష్ ఈ సంవత్సరం తిరిగి తెలుగు రంగంలోకి ప్రవేశిస్తున్నారు. 1988లో రిలీజయే తన పది చిత్రాలలోను, కనీసం నాలుగైనా తెలుగువి ఉంటాయట. తెలుగు నుంచి తమిళంలోకి వెళ్లి పేరూ డబ్బు తెచ్చుకుని, తమిళం నుంచి మళ్లీ తెలుగులోకి వస్తున్న సందర్భంగా, వుడ్‌లాండ్స్ మినీ హాలులో యిష్టాగోష్ఠి ఏర్పాటు చేశారు సురేష్....పి ఆర్ ఒ; జగన్.

. . . . . 22

శ్రావణ శంపాలతా, దేవ మందారమా అని వల్లెవాటు అందంగా వేసుకున్న యువకుడు (రఘు) తనని మెచ్చుకోగా వొంపులుతిరిగి హొయలు కురిపిస్తుంది నవ కథానాయిక - భరద్వాజ దర్శకత్వం వహించిన 'మన్మథ సామ్రాజ్యం'లో నిర్మాత : వెంకటేశ్వరరావు.... ఉత్తరాంధ్రలోని విశాఖ తీరసోయగాలు ఎంతో రమ్యంగా కెమెరాలోబంధించారు.శ్రీదుర్గ, కిన్నెర, మీనా అనే ముగురమ్మాయిలతో బాటు మీరో ఇద్దరు కొత్తవారున్నారు. 'దేవిశ్రీదేవి'లోపాటలు చూస్తున్నపుడు, పూవిలుకాని లోకంలో మెరుపు తీగెల వెంట గర్జనలు తప్పవనిపించింది. పి ఆర్ ఒ : సినీప్లాగ్ వెంకటేశ్వరరావు.

స్త్రీ పురుషుల మనస్తత్వంలో తేడా ఎక్కడంటే, పురుషుడు తనకి కావలసిన రూపాయి వస్తువుని రెండు రూపాయి లిచ్చి అయినా కొంటాడు; స్త్రీయేమో తనకి అక్కర్లేని రెండు రూపాయల వస్తువుని రూపాయికి కొంటుంది.

—విలియమ్ బింజ్

గానమధ

# రామినీడు చిత్రాల నుంచి

అవి నేను బొబ్బిలిలో వుంటున్న రోజులు. నెలకూ ఆరువారాలకూ విశాఖపట్టణం వెళ్లి రేడియో హౌమ్‌లో రికార్డులూ, బుక్ స్టాల్స్‌లో పుస్తకాలు కొనుక్కొని, ఉన్న రెండు రోజుల్లోనూ నాలుగైదు సినిమాలు చూసే ఓపిక వుండే వయసు. అప్పుడు చూశాను 'చివరకు మిగిలేది.' ఆ సంవత్సరమే (1960) నేను మద్రాసు రావడం, స్థిరపడటం జరిగింది. దీనికి కారణం ఆ చిత్రంలోని సంగీతం.

అప్పటికే 'చిన్నకోడలు' (1952) 'రేచుక్క' (1955) చూసిన నాకు మల్లాది రామకృష్ణశాస్త్రిగారి సాహిత్యం, అశ్వత్థామ సంగీతం అంటే ఒక విధమైన యిష్టం, నిజం చెప్పాలంటే ఒకవిధమైన యిష్టం. నిజం చెప్పాలంటే ఒకవిధమైన మరులు ఏర్పడటం జరిగింది. ఇక 'చివరకు మిగిలేది' చూసినప్పటినుంచి ఆ పాటలు రికార్డుపై యెప్పుడు వస్తాయో అన్న తహ తహ తట్టుకోలేక వారాని కొకసారి బొబ్బిలినుంచి విశాఖకు ట్రంకాల్ చేయడం ప్రారంభించాను. ఎం. వెంకట్రామయ్యగారు (రేడియోహోం అధినేత) చిరాకుపడకుండా 'ఇంకా రాలేదండీ! - కేటలాగుల్లోనూ వేయలేదండీ' అనేవారు.

మద్రాసుకి వచ్చాను. అంతకు ముందే పరిచయంవున్న గుమ్మడిగారు ఓడియన్ థియేటర్‌లో 'స్కిడ్' అన్న జెకొస్లొవేకియన్ చిత్రం చూస్తుండగా తారసపడ్డారు. అప్పటికి నాకు సినిమా పరిశ్రమలో యెక్కువమంది తెలియదు. 'చివరకు మిగిలేది' డైరెక్టర్ గాని నిర్మాతగాని తెలుసా అంటే 'ఆఁ' అంటూ ఆ సినిమా చూడటానికి వచ్చిన రామినీడుగారికి పరిచయం చేయడం, మరుసటి దినమే నేనాయన ఆఫీసుపై దండయాత్ర చేసి (నవశక్తి ఆఫీసు) ఆ వైనాలు కనుక్కొని సరస్వతీ స్టోర్స్‌కి వెళ్లి ఎస్ కణ్ణన్‌గారి ద్వారా ట్రాక్స్ యిప్పించి, కార్డులు తెప్పించాను.

ఇదీ నేను సినిమాకు సంబంధించినంతవరకు చేసిన మొదటి ఘన కార్యం.

అంతకు మునుపే మాయింటి మహలక్ష్మి' (1959) చూసి వున్నాను. పాటలుకొన్నివిన్నాను. కాని నిజంగా రామినీడంటే ప్రత్యేకమైన దృష్టి యేర్పడింది. 'చివరకు మిగిలేది చూశాకనే. అప్పట్లో ఆయన కొంత తీసి ఆపిన 'కలిమి లేములు' పునః ప్రారంభిస్తున్నారు. ఆ చిత్రానికి ప్రెస్ రిలేషన్స్ చూసుకొంటానని నేనడగటం, ఆయన సరేననడం (నా

(జీతం నెలకు డెభ్బై రూపాయలు) దానికోసం పిక్‌న్యూసన్న సైక్లొస్టయిల్ పత్రిక నెలకు మూడు సంచికలు మొదలుపెట్టడం జరిగింది.

ప్రెస్ రిలేషన్స్ యీనాడు ఘుమ్మరమైన గురుపరిశ్రమ - అనాడు లఘువుగా ప్రారంభం చేయడం నేను చేసిన రెండవ ఘనకార్యం.

ఈ రెండిటికీ రామినీడుగారి ప్రోత్సాహకులు.

మూడవది, ముఖ్యమైనది, నా జీవితాన్ని ఒక మలుపు తిప్పినదీ ఆయన చలవవల్ల జరిగిందే. శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రిగారి ఆలనా పాలనా క్రింద నేను రావడం.

ఆ రోజుల్లో బాపు, ముళ్లపూడి వెంకటరమణ నన్ను ఆంధ్రపత్రికాధినేతయిన ఎస్. రాధాకృష్ణగారి వద్దకు తీసుకువెళ్లి, పరిచయంచేసి, ఆంధ్రవార పత్రికలో నాకొక శీర్షిక యిప్పించడమూ, మల్లాదివారు నామకరణం చేయగా, నన్ను సరాగమాల ద్వారా ఆంధ్రపాఠకులకు పరిచయం చేయడమూ అప్పుడే (6-4-62) జరిగాయి. మొదటి వారంలోనే మల్లాది అశ్వద్ధామల 'కలిమి లేములు' పాటలు (గాలిలో) రికార్డింగ్ గురించి వ్రాశాను. ఆ తరువాత, 'కొమ్మల మీద' పాట గురించి వ్రాసాను. ఒక్కోసారి ఆయన పాటలో వుపయోగించిన పదజాలాన్నే వచనంలో వాడుకొనేవాణి.

'రామినీడుగారి షష్ట్యబ్దుత్సవం తలపెట్టిన కమిటీ మీటింగుకి, రండని దాసుగారు పిలిస్తే వెళ్లడం నేనీపని చేయగలనని అభ్యర్థించడం కమిటీ అంగీకరించి వొకపని అప్పజెప్పడం నా అదృష్టం.

'రామినీడు నివాళి' అన్న పేరుతో గ్రామఫోన్ కంపెనీవారు విడుదల చేయనున్న రెండు కేసెట్లలో మల్లాది, కొసరాజు, సదాశివబ్రహ్మం జి. జేషువా అశ్వద్ధా, పెండ్యాల ఘంటసాల, రామినీడు చిత్రాలలో వెలయించిన సంగీత సుమాలను కదంబంగా కట్టినవాడను నేను.

అడిగిన వెంటనే ఔననడమే కాకుండా ఒకటి కాదు రెండు వేయండని ఉత్సాహపరచిన బి.ఎస్. శ్రీథర్‌కీ, (గ్రామ్‌కో బ్రాంచి మేనేజరు బొమ్మలు వేసిచ్చిన బాపుకి కృతజ్ఞతలు చెప్పడం మర్యాద.

మొదటి కాసెట్‌లో మల్లాదివి 'మనసే నందన వనం', 'రతిచేతి రాచిలుక', 'మా యింటి మహాలక్ష్మి', 'చివరకు మిగిలేది' చిత్రాలలో అన్ని పాటలూ 'అనురాగం' (1965) లోని మల్లాది రచన 'సన్నజాజి'.... ఉన్నాయి. రెండవ కాసెట్‌లో 'కలిమి లేములు' లోని నాలుగు పాటలు 'పల్నాటియుద్ధం' నాలుగు పాటలూ కొన్ని పద్యాలూ (1965) 'భక్త పోతన'లో పద్యాలూ వుంటాయి.

—వివిక రంగారావు

✱

# ముఖచిత్రం

"ముప్ఫయి సంవత్సరాల క్రితం ఈ వనరిక, ఈ చెట్లు, ఈ పక్షులు, చూపులకి యిలానే వున్నప్పటికీ, మరొక సందేశం చెప్పేవి. విజయ సోపానాల వైపు ఉరుకులెత్తమనీ స్వాప్నిక సౌందర్యాలని అందుకోమనీ ఆరాటపెట్టేవి. నిస్పృహలతో కూడిన ఆ లాలన, దృష్టిని నిశిత పరిచింది. అప్పట్లో నా ప్రపంచం, నేను జయించ వలసిన విహారభూమిలా కనిపించేది. ఆనాటి చంద్రకాంతిలో శాఘోసాంగ్సూ, మీరాభజనలూ, గొథె షెల్లీల పొయిట్రీ నన్ను రాగడోలికలలో ఊపి పరవశింపజేసేవి. ఆ పరవశత్వం ఒక మధుకీల. ఈనాడు ఆ ఉద్వేగానికి బదులు, అనుభవసారజనితమైన సాక్షీభూతభావన కలుగుతోంది - ఈ బుడగలకీ నురుగులకీ అడుగునున్న ప్రశాంత జలవాహినిని వీక్షించే అనుభూతి. నా అభిరుచులు నా అభిప్రాయాలూ, నా ఆశయాలూ అనుకున్నవన్నీ కాలపురుషుని కాగితం పడవలా? అక్షరాలా అలా అనలేను. నా ఆలోచనలో సృజనాత్మక లక్షణం ఉన్నంత మేర అది సజీవమై ఉంటున్నది. ఆ సృజన లక్షణాన్ని నా ఆలోచనాక్రమంలో పెంపొందించుకోవడం ద్వారానే, నా వైఫల్యాలు నన్ను బాధించని స్థితికి ఎదిగాను. అందరిలో ప్రత్యేకత పొందాలని తపన పడటంగాక, భిన్నస్వరాలను ఆలకించి, అహం ప్రవృత్తిని అదుపులో పెట్టుకోవడం ద్వారానే మానసికానందం లభ్యమవుతుందని అవగతమయింది. నేను ఒక వేదాంతినీ కాదు; మేధావినీ కాదు .... లిఖిత చరిత్ర వయసు 27 వందల సంవత్సరాలు. ఫారోల ఈజిప్ట్ పెరిక్లిస్ గ్రీసు, డేరియస్ ఇరాన్, సీజర్ల రోమ్ తమ ఆధిభౌతిక సంపద నశింపుతో అవశేషాలుగా మిగిలాయి. అయితే భారతీయ సంస్కృతిలోని మనువు, బుద్ధుడు, భాసుడు, కాళిదాసు, కౌటిల్యుడు, కృష్ణుడు సజీవమూర్తులు. గీతాబోధ తరతరాలుగా భారతీయులకి స్ఫూర్తినిస్తోంది.... గాంధారశిల్పంలో గ్రీకుల ప్రాభవం ఉంది. తాజ్‌మహల్ నిర్మాణంలో ముస్లిమ్‌ల వాస్తుకళ ఉంది. అరవిందయోగి, మహాత్మాగాంధీ నాకు దారి చూపిన తేజోమూర్తులు" - అన్నారు కులపతి కెయమ్ మున్షీ. 1954లో తన 67వ జన్మదినసందర్భంగా! ఇది ఆయన శతజయంతి సంవత్సరం స్వదేశంలోను, విదేశాలలోను శాఖోపశాఖలుగా విస్తరిల్లిన భారతీయ విద్యాభవన్ ఆయన కలలపంట - ముందు తరాల కోసమై ఆయన నాటిన మహావృక్షం.



ఉదయ కాంతులు ప్రభాతాన్ని సూచిస్తున్నాయి; ప్రతి ప్రభాతంలోను కర్పూర నీరాజనం ఉంది.

సూర్యకిరణ్ సమర్పించు




శ్రీ లలిత కళాంజలి ప్రొడక్షన్స్

# అత్త మెచ్చిన అల్లుడు

కోడిరామకృష్ణ

వాకాడ [illegible]
డా. సూర్యచంద్రరాజు

వాకాడ అప్పారావు · దాట్ల రామకృష్ణంరాజు

---

సీరియల్

# 'ప్ర గురువారం'

భార్యా భర్తలు ఒక చిన్న ఊర్లో 'ఆర్కైయివ్' అనే వార పత్రిక నడప డంలోని సాధక బాధకాలు చెబుతోంది జేన్ మెక్లవిన్. అడ్వర్టయిజ్‌మెంట్లు సేకరించడం ఆమె వంతు, మిగతా భారం భర్త బాబ్‌ది..... ఇక చదవండి

ఒక్క మొదటి నెల తప్ప, ఆ తర్వాత పత్రిక స్వయంపోషకంగా అయింది. హానీబ్రూక్‌లోని ప్రింటింగ్ బిల్లూ మా యింటి ఖర్చూపోను కొద్దిగా మిగిలేది. ఏనెల ఖర్చులు ఆ నెలకి సరిపడితే చాలుననేగాని, డబ్బు మిగలాలనే తృష్ణ లేదు మాకు. మా బాధ ఎంతకీ 'ఆర్కైయివ్' గురించే !

వివాదగ్రస్తమైన ఒక విషయంలో, మేము యిటువంటి సంపాదకీయం రాశాం :

## తలదూర్చడం

మన రాజ్యాంగ ప్రణాళికలో ఒకానొక సవరణని ప్రవేశపెట్టే నిమిత్తం, మన ప్రజలందరూ నవంబరు 8వ తేదీన వోట్లు వెయ్యడానికి వెళ్లారు. యుద్ధభూమి నుంచి తిరిగి వచ్చినవారికి (Veterans) 50 కోట్ల డాలర్లు పంచిపెట్టే నిమిత్తం ఈ సవరణ.

నేనూ వెటరన్నే. యుద్ధరంగంలో అయిదేళ్లపాటు వుండివచ్చాను. నాకూ 500 డాలర్లు వొస్తుంది. యుద్ధానంతర కాలంలోని చిన్న వ్యాపారం నడుపుకుంటూ, అందులో సతమతమవుతున్న నాకు 500 డాలర్లు స్వల్ప మొత్తంకాదు సంతోషించవలసినంత మొత్తమే. కాని, ఈ సవరణకి మేము వ్యతిరేకులం.

50 కోట్ల డాలర్లు ప్రభుత్వం బోనసుగా యివ్వాలనడంలో ఒకే ఒక్క వాదం విననవుతోంది. 'పాపం- వాళ్లు చాలా కష్టపడ్డారు; అందుకని యిద్దాం.'- నేనూ వెటరన్స్‌లో ఒకణ్నే మేము కష్టపడ్డ మాట నిజమే. కాని ఆ కష్టపడటం మా ధర్మం నిర్వహించేందుకు పడ్డాం. యుద్ధకాలంలో దేశరక్షణకి పాటుపడటం, ప్రతి పౌరునికి ధర్మమై ఉంది. మన రాజ్యాంగ ప్రణాళిక అటువంటి పౌర బాధ్యతని సుస్పష్టంగా నిర్వచించింది. ప్రాణాలు పోగొట్టుకున్న యితర సోదరులకంటె, మేము అదృష్టవంతులమని గర్వపడాల్సి వుంది.

పెన్సిల్వేనియా బోనస్ ప్లానును మేము ముఖ్యంగా ప్రతియటిస్తున్న దెందుకంటే, దానివల్ల ప్రభుత్వానికి

అప్పు మూడింతలు పెరగడమే గాక, ఆ అప్పును తీర్చే మార్గం కూడా కను పించకపోవడం వల్లనే! అదీగాక ప్రభుత్వం ఖర్చుచేయవలసిన అనేక కార్యక్రమాలలో ఇది ఒకటి. ఇవన్నీ కలిసి ప్రభుత్వం చేసే ఖర్చులో మూడవ వంతును మ్రింగేశాయని తేలింది. కనుక అప్పులు మరింత పెరిగి ఇవన్నీ కలిసి, ప్రజలపై మరింత భారం పడుతుందన్నమాట.

50 కోట్ల డాలర్లు ప్రభుత్వం పంచి పెడుతుందంటే, మహా బావుంటుంది. కాని, ప్రభుత్వ ఖజానాలోకి డబ్బు ఎక్కడ నుంచి వస్తుంది? ఈనాడు ప్రభుత్వంచేసే అప్పుని, రేపు తీర్చుకోవలసింది ప్రజలు కాదా? మాజీ సైనికుల సంఘాలనాయకులకి నా మాటలు రుచింపక పోవచ్చు. కాని, పరమసత్యం యింతకంటే వేరే ఏముంది? నిర్మాణపథకాలు ఆచరణలో పెట్టేందుకు ఒకవంక తడుముకొంటూ, 50 కోట్ల డాలర్లు వెటరన్స్‌కి పంచిపెట్టడమంటే, ప్రజల నెత్తిని మరికొంచెం బరువు మోపడం గాక మరేమిటి?

అందరూ మా అభిప్రాయాలతో ఏకీభవించకపోవచ్చు. మీ మీ అభిప్రాయాలు మాకు సంపాదకలేఖలుగా వ్రాయండి - సంతోషంతో ప్రచురిస్తాం. మా దృక్పథం మట్టుకు ఈ బోనసు యివ్వడం అనవసరమని, దేశం మొత్తంమీద ఈ విషయమై తీవ్ర వాదోపవాదాలు జరుగుతున్నాయి.

మహాప్రవాహానికి ఎదురీదడ మెందు

# AMBICA DURBAR BATHI AWARD

Sri Ramanand Sagar is giving us every Sunday, the glorious epic 'Ramayan'. Through its various characters he is exemplifying the three principles of dharma, morality and sacrifice. If those who have understood the nature and the greatness of the characters in the Ramayan, talk about them, then arises a transfor-mation in human attitudes.

Sri Arun Govil who acts in the T.V Serial Ramayan lives the role of that great Sree Rama His acting enlivens. the principles of dharma morality and sacrifice and gives a divine feeling to the T.V. Viewers.

We are proud to offer the Ambica Durbar Bathi Cash Award of Rs. 15,000/- (Fifteen Thousand) introduced by our Company the Ambica Chemical Products (Regd.), -its inaugurals presentation - to Sri Arun Govil on the occasion of their 42nd Anniversary Celebrations at Eluru on 25-1-1988.

కని అడుగుతారేమో - కాని ఒక్కొక్క ప్పుడు ఎదురీదక తప్పదు; యిలాటి వాటిల్లో తలదూర్చకా తప్పదు. స్వార్థ పరులు కొందరు ఆడుతూన్న రాజకీయ జూదమిది. ఆ సంగతి కొందరు విజులకి తెలియకపోలేదు. కాని, ఎదురీది లాభం లేదని, వారు పెదవి మెదపకుండా వూరుకున్నారు. ఈ సవరణ అసమంజసమని, మా నిశ్చితాభిప్రాయం. సవరణకి మేము పూర్తిగా వ్యతిరేకులం.

అంచేత, ప్రతిపౌరుణ్ణీ తను ఓటు వెయ్యడానికి ముందు, దూరదృష్టితో ఆలోచించమని కోరుతున్నాం.

* * *

ఈ సంపాదకీయం ఫలితం ఏమిటంటే, కొందరు చందాదారులు మాను కున్నారు. సవరణని ప్రభుత్వం ఆమోదించింది. మరొక సందర్భంలో కూడా యిలానే యిరుక్కున్నాం. కాని, అది మా ప్రతిష్టని పెంచింది.

గురువారం వుదయం మేము ఆఫీసుకి వచ్చేవేళకి, మా పత్రికలమ్మే సామ్, "తొమ్మిది కొట్టక పూర్వమే 275 కాపీలు ఖర్చయాయి. ఇంకా కావాలంటున్నారు" అన్నాడు.

మేము ఆశ్చర్యపోయాం – కారణమేమిటో తెలియక.

"నాలుగు వీధుల మధ్య డైనమైట్ పెట్టినంత పని చేశారు" అన్నాడు సామ్.

అప్పటికీ అర్థం కాలేదు మాకు.

"ఎవిక్షన్ కేసు (Eviction Case) అందులో పెద్దవాళ్లు యిరుక్కున్నారు."

"అందులో ఏమీలేదే! ఉన్నకథే ఎంతో టూకీగా చెప్పాం. అసలు విషయాలు చెప్పనుకూడా లేదిదే!" అన్నాడు బాబ్.

"అచ్చులో అక్షరాలు కనిపించేసరికి మనుషులకి ఆరాటం పుడుతుంది. మన ఊళ్లో కూడా ఒక పత్రిక ఉందని క్రమంగా తెలుసుకుంటున్నారు" - అన్నాడు సామ్.

పట్టణాల పత్రికలు వేసే ప్రముఖ వార్తల్లాటిదే ఆ కథ. "మాజీ సైనికుని పై యింటి యజమాని ప్రతాపం"–నిజానికి, చిన్న పట్నాలలో యింటి యజమానులు ప్రతాపం చూపరు. కానీ, ఏదో అందంగా ఉండేందుకు ఆమాట వాడాం. అసలు ఈ కథని మాకు వెటరన్ వొచ్చి చెప్పాడు. అతను యుద్ధ కాలంలో నావికుడు. కార్మిక సంతతికి చెందిన వాడు కాబట్టి హక్కులూ గిక్కులూ అతనికి బాగా తెలుసు. ఈ డవునింగ్ టవున్‌కి దగ్గరలోనే ఉన్న ఉక్కు యంత్రాగారంలో పనిచేస్తున్నాడతను. వెనుకొకసారి మాకు సంపాదక లేఖ రాశాడు. ఎప్పుడయితే, ఎవిక్షను ఆర్డర్లు వచ్చాయో, అప్పుడు తిన్నగా మా ఆఫీసుకి వచ్చి, తనకి జరుగుతున్న అన్యాయం వర్ణించి చెప్పాడు. చెప్పి, మా సహాయము కోరాడు. కార్మిక వర్గానికి చెందినవాడు కాబట్టి, తన కేసునితనుస్పష్టంగాచెప్పుకోగలిగాడు.

మేము అతని యింటి దగ్గిరికి వెళ్లేటప్పటికి ఒక మోటారువానూ, అమీనా (Deputy Sheriff) అమీనా మనుషులూ కనిపించారు. గుమ్మాల

పక్కల నుంచునీ గోడల మీద అనుకునీ యిరుగు పొరుగు వారు వినోదం చూస్తున్నారు. డాక్టరొకతను యింట్లో నుంచి బయటికొచ్చి, ఆ గృహస్తు భార్యకి చాలా జబ్బుగా వుందనీ, ఎవిక్షన్‌కి యిప్పుడు వీలు కాదనీ అమీనాతో చెప్పాడు. ఈ దిక్కుమాలిన పని తనకి తప్పిందిగదా అనుకొంటూ, అమీనా తన మనుషులతో, హాయిగా ఆ మోటారువాన్‌లో వెళ్ళిపోయాడు. కథ పూర్తి అయినట్లే ఆ పూటకి.

ఆ యిల్లు ఒక పోలీసు యినస్పెక్టరుడి. పోలీసు యినస్పెక్టరు క్రింద భాగంలో ఉంటున్నాడు. న్యాయపాలన కోసమే పుట్టాడా అని అనిపించే యినస్పెక్టరతను. ఆయన గారికి, తన

## THANKSGIVING

Friends : This small get-together is to express our deep sense of gratitude to the Press for the wide coverage given to us when we were robbed of our valuables at knife-point on March 30, 1987. I came to Hyderabad to receive an Award from the State Government. When the crime was reported to the police authorities, they quickly went into action and in less than a week they could recover from a pawn-broker in Mylavaram, Krishna District, the three pairs of my gold bangles. A few weeks later the rest of the jewellery was recovered in ingot shape and the culprit apprehended and subsequently convicted. Yesterday from the 5th Metropolitan Magistrate, Sri Damodaram, I received my three pairs of bangles, 38.5 grams of pure gold and Rs. 1,200/- in cash. In this connection we feel we should express our grateful thanks to Sri Hanumantha Reddy, DCP (Crimes), Sri T. Suryanarayana Rao, Commissioner of Police, Sri S. R. Phadke, the Inspector in charge of this particular case and many many other Officers. Our humble salutations to our beloved Chief Minister, Hon'ble Sri N T Rama Rao and our sincere regards to the fraternity of Press who stood by us and played a prominent role and to the police authorities who have been quick, efficient and public-spirited. And we warmly thank you for your response to our invitation at such a short notice.

Jan. 28, 1988
Tajmahal - Narayanaguda
Hyderabad - 29

Malati Chendur
& N R Chendur

యింట్లో మిద్దె మీద అద్దెకుంటున్న కార్మిక నాయకుని వైఖరి ఎంతమాత్రం నచ్చలేదు. ఆ మాట కొస్తే, అతని వాసనే గిట్టడం లేదు. అద్దె వాళ్ళ అమ్మాయి కుళాయి నీళ్లు వృట్టినే వొదిలి వెడుతోందనీ, అవి కిందికి కూడా బొట్లు బొట్లుగా పడుతున్నాయనీ యినస్పెక్టరు అంటాడు. అతనంటే గిట్టనివాళ్ళు కొందరు, యింతకి రెం డింతలు ఎవరో అద్దె యిస్తానన్నారు; అందుకని ఈ కథలు అల్లుతున్నాడని - అంటారు. ఏమయితేనేం, రెంట్ కం ట్రోలు వగైరాల మాట అటువుంచి ఆ పోలీసు యినస్పెక్టరు యితన్ని ఎలా గైనా బయటికి సాగనంపాలని కంక ణం కట్టుకున్నాడు.

ఇటువంటి వ్యక్తిగత వైరాల్లో, అసలు సంగతేమిటో, మనకి బుర్ర బద్దలు కొట్టుకున్నా తెలియదు. ఈ యుద్ధాలు నెలల బట్టీజరుగుతూంటాయి. ఇటు కాసేపు, అటు కాసేపు, చెబుతూం టూరు పక్కవాళ్లు. కార్మిక నాయకుని భార్య, పోలీసు ఇనస్పెక్టర్ భార్య చెడా మడా తిట్టుకునేవారు. నీళ్ళ వద్ద, దీపాల దగిర పేచీలు చెప్పనే అఖ్కరలేదు. పోలీసు ఇనస్పెక్టరుకి అతన్ని గెంటిం చాలని. కార్మిక నాయకునికి, ఆరు నూరయినా సరే తన హక్కులు నిల బెటుకోవాలని! అదీ వైరం - ఇద్దరూ పరిసమాన వుజ్జీలే!

ఈ విషయాలేమీ మేము రాసిన వార్తల్లో లేవు. అమీనా రావడం, మోటారువాన్, డాక్టరు, అమీనా వెళ్లి పోవడం, అంత మట్టుకే రాశాం. మేము ఆ కథని ఎలా ప్రచురించామా అని, పట్నం యావత్తు ఆశ్చర్య పోయిందట.

"పోలీసు యినస్పెక్టరు అసా ధ్యుడు. మిమ్మల్ని యింక వదిలి పెట్టడు. అతనికి ఎంత పలుకుబడి వుందో మీకు తెలియదు కాబోలు. ప్రమాదకరమైన మనిషితో తెచ్చి పెట్టుకున్నారే పేచీ!" అని మమ్మల్ని హెచ్చరించారు కొందరు.

తర్వాత ఒకసారి పోలీసు యినస్పెక్టరుని ఎందుకో కలుసు కున్నాం. అతను చాలా జాగ్రత్తగా చక్కగా మాట్లాడాడు. మా మీద కోపతాపాలు వున్నట్టేమీ కనపడ లేదు.

ఒకరోజు సాయింత్రం బాబ్ ఆఫీసులో పని చేసుకుంటూ వుండగా, రాజకీయవాది ఒకతను మా ఆఫీసుకి వచ్చాడు. అప్పుడప్పుడు గాలి కబుర్లు చెప్పేందుకు వచ్చేమనిషి అతను; మాకు కొత్తవాడు కాదు. కాసేపు లోకాభి రామాయణం అయాక అన్నాడు: "మీకు తెలియదా యింకా- మిమ్మల్ని ఊళ్లోనుంచి తరిమేద్దామను కుంటున్నారు!"

"ఎవరా అనుకుంటున్నది?" అని అడిగాడు బాబ్.

"ఎవరేమిటి? ప్రజలు. కొన్ని పెద్ద తలకాయలు అనుకుంటున్నాయి మిమ్మల్ని తరిమెయ్యాలని. మీ ధోరణి సరిఅయినది కాదట! మీరు 'రెడ్స్' అని. . ."

బాబ్ ఫక్కున నవ్వేశాడు. విరగబడి

నవ్వుతూ, "అదీ ఒకందుకు మంచిదే! అటువంటి ప్రయత్నం చేయడం వల్ల మా సర్క్యులేషన్ రెండింతలవుతుంది. చాలా మంది ఎడిటర్లు ఆవిధంగా బాగుపడ్డారు" అన్నాడు.

రాజకీయవాదికి ఏం మాట్లాడాలో తోచక మాదగిర సెలవు పుచ్చుకున్నాడు. మళ్లా కనిపిస్తే వొట్టు.

ఎవిక్షన్‌కి సంబంధించిన వార్త ప్రచురించిన వారంరోజులకి అరుగురు వెటరన్స్ తమ సంతకాలతో ఉత్తరం రాశారు. అన్యాయం ఎవరికి జరుగుతోందో వారికి స్పష్టంగా తెలియదుగాని, పోలీసు యినస్పెక్టరుని మట్టుకు నిలదీశారు. వారి ఉత్తరంలో వంద మాటలు మాత్రమే ఉన్నాయి – కాని ఆ వందా రత్నాల్లాంటివి. ఉత్తరం అచ్చు వేసేటప్పటికి, అందులో ఒకతని ఉద్యోగం పోయేటంత పని అయింది; కాని చివరికి పోలేదు. అతను యువజన సంఘానికి నాయకుడు.

ఏమయితేనేం, ఒక ఏడాదిపాటు ఈ ఎవిక్షన్ కేసుతో, ఊరంతా అట్టుడికినట్టు వుడికిపోయింది. ఎవరి నోట విందామన్నా ఈ కబుర్లే. నిజానికి, పోలీసు యినస్పెక్టరు అంత మరీ చెడ్డవాడుకాదు. అతను కొద్దిగా డబ్బున్నవాడు కాబట్టి, కార్మికవర్గం అతనిమీద లేనిపోని నిందలు లేవదీసింది.

ఇలా జరిగింది, అలా జరిగింది— అని రకరకాల కథలు చెబుతూండేవారు. కాని, మేము ఏమీ రాసేవాళ్లం కాదు. ఇతరులు రాసి పంపించినది వారి బాధ్యతతో, పత్రికా ధర్మానికి విరుద్ధం కానంతవరకూ, అచ్చువేసే వాళ్లం. ప్రజాభిప్రాయమనే వెలుగు చీకటి మూలల్ని వెలిగించగలదనే సత్యం తెలుసుకున్నాం.

సంపాదకీయాల ద్వారా ఎటువంటి సమస్యలని ఎదుర్కోగలమనేది, అంత సులువుగా జవాబు దొరికే ప్రశ్నకాదు. పట్టువిడుపులు వుండాలి. అంతేకాదు, ఏ విషయమైనా సరే కఠినంగా గాక మృదువుగా చెప్పాలి; బల్ల గుద్ది చెప్పడంకాదు —మృదువుగా చెప్పడం చేతనవాలి.

## 11

మా పత్రికలోని ప్రతి విషయం, చదువుకునేందుకు చక్కగా వుండాలని మా ధృఢ సంకల్పం. ప్రతి చిన్న విషయం మా దృష్టికి, ముఖ్యమైన విషయంగానే కనపడేది. ఎందుకంటే ప్రజాస్వామ్యమనే మహావృక్షపు వేళ్ళు యిటువంటి చిన్న చిన్న విషయాల నుంచే జీవం పోసుకుంటాయి. స్థానిక సమస్యలూ ఆలోచనలూ ఆరోగ్యవంతమైన విస్తృతపథానికి దారితీస్తాయి.

మొదట్లో మేము పెద్దపెద్ద పనులు చేయాలని ఉబలాట పడ్డాం. కాని, కాలక్రమేణా తెలుసుకున్నాం. ప్రజాస్వామ్య దేశం లోని స్థానిక సమాజంలో వార్తాపత్రికకి ప్రముఖ స్థానం ఉంది; కాని అది సేనాధిపతి లాగానూ, రాజకీయ నాయకుడికి మల్లేనూ వ్యవహరించలేదు. ప్రజా జీవితాన్ని చైతన్య స్రవంతి వైపుగా మట్టుకు మళ్లించగలదు.

ప్రతి సోమవారం రాత్రీ బాబ్ పుర పాలక సంఘ సమావేశాలకి వెళ్ళేవాడు. పట్నంలోని మంచినీటి సప్లయి గురించి యింజనీరుగారు అంకెలూ ఆనవాళ్ళూ చెప్పేవాడు; ప్లీడరుగారేమో దస్తా వేజులూ మతలబులూ చెప్పేవాడు. కళ్ళమీదికి నిద్దర కూరుకొస్తున్నా, శ్రద్ధగా వినాలి. అలాటి మీటింగులు, ఆ సమావేశాల్లోది యథాతథంగా 'అర్కా యివ్'లో కనపడాలి. అది పత్రికా ధర్మం. ఒక్కొక్కప్పుడు పురపాలక సంఘాధ్యక్షుడు ప్రతికా నిర్వహణ గురించి, బాబ్‌కి లెక్చరిస్తూండేవాడు. 'అర్కాయివ్'ని ప్రజావేదికలా, పట్టణాన్ని బాగుచేసే విషయమై పాఠకులు వ్రాసే అభిప్రాయాలు, ఆయనకు నచ్చేవికావు. అయినా పత్రిక అభిప్రాయాలను అమలుజరపక తప్పేది కాదు. ఇలా కొన్ని జరిగినై కూడా.

అర్కాయివ్ పత్రిక క్రిస్మస్ కమిటి నొకదాన్ని ఏర్పాటు చేసింది. క్రిస్మస్ సందర్భంలో ఊళ్ళో వున్న పిల్లలంద రికీ, ఒక వెయ్యి ఆటవస్తువులు పంచి పెట్టడం, బీదాబిక్కికి తిండీ బట్టా యివ్వడం - ఆ కమిటీ చేయవలసిన పనులు.

డాలర్ - డే సేల్ అంటూ, ఒక మూడు రోజులపాటు వర్తకులందరు తమ దగ్గిరవున్న వస్తువులని చవక ధరకి అమ్మేందుకు ఏర్పాటుచేశాం. ఈ కార్యక్రమంలో వర్తక సంఘం మాకు ఎంతగానో సాయపడింది. స్థానిక వర్తకులు ఒకళ్ళతో ఒకళ్ళు కలవరు. అలాటివాళ్ళని కూడగట్టుకు వచ్చేందుకు కాళ్ళు అరిగేటట్టు తిరిగాను.

ఒకానొక పెట్రోలు బంక్ యడ్వర యిజ్‌మెంటు ఎలా పడిందంటే: ప్రతి పావుగాలను ఆయిల్‌కి అయిదుగాల నుల పెట్రోలు ఫ్రీ. అసలు ఆ ప్రకటన- అయిదు గాలనుల పెట్రోలుకి, పావు గాలను ఆయిల్ ఫ్రీ-అని వుండాల్సింది. ఫారమ్ ముప్పాతిక ప్రింటు అయాక మాకు ఆ తప్పు కనపడింది. ఇంక అప్పుడు చేయగలిగేదేముంది - ఏమీ లేదు! పత్రిక పూర్తయేవేళకి నా స్థితి ఎలా వుందంటే, అయిదు గాలనుల. పెట్రోలు కాదు, అయిదు పెట్టెల వజ్రా లు పంచి పెడుతున్నారని చదివినా, "పోనీ, తప్పుపడితే పడిందిలే!" అనుకునేటట్టు వున్నాను.

పత్రిక నాలుగు మూలలకీ వెళ్లిందో లేదో, పెట్రోలు బంక్ యజమాని పీటర్సన్ పరిగెత్తుకుంటూ వచ్చాడు మా ఆఫీసుకి. "వందకారులు వరసని నిలబడి వున్నాయి మా బంక్ దగ్గిర. ట్రాఫిక్ సరిజూసుకోమని పోలీసులకి ఫోను చేసి, యిలా వచ్చాను. మీరు అక్కడికి వచ్చి ఫలానా పొరబాటు జరిగిందని బోర్డు కడితేగాని, నా మర్యాద దక్కదు."

'అర్కాయివ్' వేసిన అచ్చుతప్పుకు మన్నించ వలసిందని మేము బోర్డు రాయిస్తూండగా, వ్యవసాయ పనిముట్లు అమ్మే జిమ్, ట్రాక్టరులోనుంచి దిగాడు మా ఆఫీసు ముందు. "మా చుట్టుపట్ల నున్న ట్రాక్టర్ల వాళ్లందరికీ చెప్పాను. అందరూ వస్తున్నారు" అన్నాడు.

పెట్రోలు బంక్ వున్న లంకాస్టర్ ఎవిన్యూలో ఒక వంద కారులు వరసగా నిలబడ్డాయి. వాటి వెనుక ఒక అరవై డెబ్భయి ట్రాక్టర్లు.

"చాలా పొరబాటు జరిగింది. మీరు ఏమీ అనుకో కూడదు" అన్నాను పేటర్సన్‌తో ఎంతో బాధావహంగా.

"ఎబ్బే - దానికేం ఫరవాలేదు. మీ పత్రిక ఎంతమంది చదువుతారో యిందువల్ల తెలుస్తోంది" అన్నాడు పీటర్సన్ మమ్మల్ని అభినందిస్తూ.

## 12

ఆర్కాయివ్ పత్రిక మా పట్నానికి ఎంత మేలు చేసిందో, ఎటువంటి మేలుచేసిందో కొలిచి చెప్పడం కష్టం. పదిమంది వున్న కుటుంబంలోని తల్లిదండ్రుల్లాటి వాళ్లం మేము. కుర్రవాడు శ్రద్ధగా చదువుకు, బుద్ధిగా వుంటే, తలిదండ్రుల్ని ఎవరూ శ్లాఘించరు. పురపాలక సంఘం చేస్తున్న మంచి పనులని మెచ్చుకుంటూ, లోటుపాట్లు ఎక్కడ వున్నాయో మాటల సందర్భంగా చెబుతున్నప్పుడు, ప్రజలు మా వునికినే ప్రత్యేకతతో గమనించరు. తల్లి తన పిల్లల విషయంలో తీసుకునే దైనందిన కార్యకలాపంలాటిదే మా పనికూడా. మాతృమూర్తిని ఏవిధంగా ప్రస్తుతించరో, ఆ విధంగానే మమ్మల్ని కూడామెచ్చుకోరు.

అనుభవజ్ఞానం ఎక్కువ లేకపోబట్టి ఈ స్థానిక వ్యవహారాల విషయంలో ఒకొక్కప్పుడు యిరుకున పడుతూండే వాళ్లం. మా సదభిప్రాయాలు ఎందుకూ కొరగాని వయేవి. సత్కార్యాలు చేదామనుకుని, పిచ్చి పనులు చేయడం, మానవ స్వభావంలోనే ఉందేమో, మేమూ పొరబాటులు చేసే వాళ్లం. నిజమనుకుని మేము వ్రాసిన వార్తల్ని, మా మీద దుష్ప్రచారానికి ఉపయోగిస్తూండేవారు కొందరు.

సందర్భవశాన కలుసుకొని, ఈ మాటా ఆ మాటా మాట్లాడుతున్నప్పుడు కొందరి కోపాలుపోయేవి. కంట్రీ ఎడిటర్‌కి అన్నీ తెలిసి వుంటాయి. కాని, తెలిసినవన్నీ పేపరు మీద పెట్టకూడదు.

ఇతరులు మమ్మల్ని కోప్పడితే కోప్పడుగాక! కాని, వాళ్ళని మళ్ళీ కోప్పడాలని అనిపించేదికాదు. కోపంలో వృధా చేసుకునేటంత టైమేదీ మాకు? ఇటు మనుష లేమంటున్నారో, అటు మనుష లేమంటున్నారో తెలుసుకోడం, ప్రజాజీవనం ఏ ప్రవాహగతిని అనుసరిస్తుందో గ్రహించడం, మా సంపాదకీయ దృక్పథం ఎలా ఉండాలో నిర్ణయించుకోడం - యిదే మా పని!

మేము ఎవరికీ చెందక, నిష్పాక్షికంగా ఉండటం, ప్రజలని ఆశ్చర్యచకితులుగా చేస్తూండేది. మేము యిటో అటో తెలుసుకోవాలని వారికి ఉండేది. మేము ఎటూ కాదు. వెనుకటి ఎవిక్షన్ కథలో, పోలీసు యిన్‌స్పెక్టరు ప్రజల దృష్టిలో, చెడ్డవాడుగా కనపడ్డాడు.

(ఇంకా వుంది

# టెలర్ టేబుల్

ఎస్. ఆర్. ఫడ్కే
(ఇన్స్‌పెక్టర్, సిటీ డిటెక్టివ్ బ్రాంచ్)

ఆ రోజు ఉగాది పండుగ. 1987 మార్చి 30వ తేదీ సోమవారం ఉదయం ఆరు గంటలు. అది రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లోని నట్టనడి బొడ్డునున్న లక్డీకాపూల్‌లో గల ద్వారకా హొటల్. ఆ హొటలులోని రూమ్ నెంబరు 103 లో రచయిత్రి శ్రీమతి మాలతీ చందూర్, ఆమె భర్త, జర్నలిస్టు అయిన శ్రీ ఎన్. ఆర్. చందూర్‌లు బస చేస్తున్నారు.

తమ పుస్తకానికి లభించిన అవార్డును ముఖ్యమంత్రి గారి చేతుల మీదుగా స్వీకరించడానికి, ఉగాది సందర్భంగా ఆరోజు (మార్చి 30న) రవీంద్రభారతిలో జరగనున్న ఉత్సవంలో సన్మానం అందుకోవడానికి మద్రాసు నుంచి తన భర్తతో పాటు శ్రీమతి మాలతీచందూర్ హైదరాబాద్‌కు వచ్చారు. వారు ద్వారకా హొటల్‌లో దిగారు.

ఉదయం ఆరు గంటల ప్రాంతంలో ఎన్.ఆర్. చందూర్ తమ గది తలుపు తెరిచి రూమ్‌బాయ్ కోసం చూస్తుండగా అంతలో ఓ ఆగంతకుడు ఆయన దగ్గరికి వచ్చాడు. 'మీ వద్ద తెలుగు పేపరు ఏదైనా వుందా సార్! ఉంటే ఓసారి ఇస్తారా?' అని అడిగాడు. 'ఉంది ఇస్తానుండు' అంటూ చందూర్ తమ గదిలోనికి వెళ్లారు. చందూర్ లోపలికి వెళ్లగానే ఆగంతకుడు కూడా అతని వెనకాలేగదిలోనికి ప్రవేశించి తలుపులు మూసేసి గడియపెట్టాడు. ఈ అకస్మిక సంఘటనకు దిగ్భ్రాంతి చెందిన చందూరు దంపతులు ఇంకా తేరుకోక ముందే ఆగంతకుడు తన జేబులో నుంచి కత్తితీసి వారిని బెదిరించాడు. తనదగ్గరున్న నైలాన్ తాళ్లతో భార్యాభర్తలిద్దరినీ చెరో కుర్చీకి కట్టివేశాడు.

శ్రీమతి మాలతీ చందూర్ వద్ద గల నగానట్రా అంత దుండగుడు దోచుకున్నాడు. వాటి విలువ దాదాపు నలభై వేల రూపాయలు వుంటుంది. పర్సులో వున్న 1200 రూపాయల నగదును కూడా దొంగ తీసుకున్నాడు. నగలన్నీ దోచుకున్న దుండగుడు ఆ దంపతుల చేతివేళ్లకు వున్న ఉంగరాలను కూడా ఇవ్వమన్నాడు. అవి పెళ్లినాటి

ఉంగరాలని చందూర్ దంపతులిద్దరూ చెప్పడంతో వాటి జోలికి పోలేదు.

దంపతులను కట్టివేసే సమయంలో దొంగ నుదుటి మీద అతని చేతిలోని కత్తి గీసుకుపోయింది. ఈ గాయం నుంచి రక్తంకారి బొక్కా పైన, టవలు పైన పడింది. అక్కడే వున్న పౌడరు డబ్బా అందుకొని అతను గాయంపైన అద్దుకున్నాడు. దోపిడి కార్యక్రమం పూర్తి కాగానే అతను బయటినుంచి గదికి తాళం వేసి వెళ్ళిపోయాడు. గది లోని టెలిఫోన్ కనెక్షన్ తెంపేశాడు. దోపిడి ముగించుకున్న వెంటనే దొంగ తాను బసచేస్తున్న అదే హోటల్‌లోని 126వ నెంబర్ గదికి చేరుకొని, ఆదరాబాదరా బట్టలు మార్చుకొని రూమ్ నుంచి వెళ్ళిపోయాడు.

దొంగ వెళ్ళిపోయిన తర్వాత చందూర్ దంపతులిద్దరూ కట్లు ఊడ దీసుకొని తమ గది వెనక వైపున బాల్కనీ వద్దకు వెళ్లి సహాయం కోసం కేకలు వేశారు. వీరి కేకలు విని రోడ్డు మీద వెళ్తున్న జనం హడావుడిగా హోటల్ యాజమాన్యానికి తెలియ జేశారు. ఈ విషయం తెలుసుకొని హోటలు వారు డూప్లికేట్ తాళపు చెవితో తాళంతీసి తలుపు తెరవడంతో సుమారు గంట సేపటి తర్వాత చందూర్ దంపతులు బంధవిముక్తు

ఆరోజు ఉగాది పండుగ కావడంతో నగర డిటెక్టివ్ బ్రాంచి పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీఎస్.ఆర్.ఫడ్కే ఇంట్లోనే వున్నారు. ఉదయం 7-30 గంటల ప్రాంతంలో ఆయన ఇంట్లోని టెలిఫోన్ మోగింది. డి.సి.పి. ఆయనకు ఫోన్ చేసి హోటల్ గదిలో జరిగిన మాలతీ చందూర్ నగల దోపిడి గురించి తెలియజేసి, వెంటనే అక్కడికి బయలు దేరి వెళ్ళవలసిందిగా పురమాయించారు.

ఇన్‌స్పెక్టర్ శ్రీ ఫడ్కే వెంటనే హోటల్‌కు చేరుకునేసరికి అప్పటికే శ్రీమతి మాలతీచందూర్ ఆమె భర్త శ్రీ చందూర్‌లు సన్మానసభకు వెళ్లిపో యారు. శ్రీమతి మాలతీచందూర్‌ఫిర్యా దుపై సైఫాబాదు పోలీసు స్టేషన్‌లో కేసు (క్రైమ్. నెం. 125/87 U/S 392 IPC) నమోదు చేసిన తరువాత కాపిటల్స్ నగర డిటెక్టివ్ బ్రాంచి పోలీసులు కేసు దర్యాప్తు చేపట్టారు. హోటల్‌లోని 103 వ నెంబర్ గదిని పోలీసు అధికారి క్షుణ్ణంగా పరిశీలిం చారు. గదిలోని వస్తువులన్నీ చిందర వందరగా పడి వున్నాయి. టెలిఫోన్ వైరు కట్ చేయబడి వుంది. ఫోటో గ్రాఫరు, చేతిముద్రల నిపుణుల కోసం ఇన్‌స్పెక్టర్ కబురు పంపించారు. వేలి ముద్రలనిపుణులు, ఫోటోగ్రాఫరువచ్చి తమ తమ పనులు పూర్తి చేశారు. అయితే నేరస్థలంలో పోలీసులకు ఎలాంటి ఆధారాలు లభించలేదు.

దర్యాప్తు అధికారి ఇన్‌స్పెక్టర్‌ఫడ్కే హోటల్ సిబ్బందిని విచారించగా వారం రోజులుగా తమ హోటలులో మకాంచేస్తున్న ఒక యువకుడు ఆరోజు ఉదయం హడావిడిగా రూమ్ ఖాళీచేసి వెళ్లిపోయాడని సిబ్బంది వెల్లడించారు. అతని హోటల్ బిలు ఎంత అయిందో

రిసెప్షనిస్ట్ లెక్క చూస్తుండగానే ఆ యువకుడు బిల్లు చెల్లించకుండా నేతప్పించుకొనిపోయాడని కూడా తెలిసింది. మార్చి 23వతేదీనుండి అతను ద్వారకా హొటలులోనే మకాం చేస్తున్నాడని, అంతవరకు పైఅంతస్థు రూమ్‌లో వుంటున్న ఇతను రెండుమూడు రోజుల క్రితం మొదటి అంతస్థులోని 12వ నెంబర్ గదిలోనికి మారాడని కూడా విచారణలో తేలింది. ఈ 126 నెంబర్ గది, మాలతీ చందూర్ దంపతులు బస చేస్తున్న 103 నెంబర్ రూమ్‌కు సమీపంలోనే వుంటుంది.

ఆగంతకుడు అకస్మాత్తుగా హొటలు గదిని ఖాళీచేసి పోవడం, బిల్లు కూడా చెల్లించకుండా వుడాయించడంతో పోలీసు అధికారికి అతని మీద అనుమానం మొదలైంది. వెంటనే ఆయన ఆ యువకుడు బసచేసిన 126 నెంబర్ గదిని పరిశీలించారు. అందులో ఒక కత్తి దొరికింది. కొన్ని బట్టలు కూడా ఆ గదిలో పడున్నాయి. పోలీసు అధికారి వాటిని సునిశితంగా పరిశీలించగా ఒక చొక్కాపై "ఆర్. కె. టైలర్స్, విజయవాడ" అనే టైలర్ మార్క్ కన్పించింది. దీన్నిబట్టి ఆగంతకుడు విజయవాడ ప్రాంతానికి చెందినవాడై వుండవచ్చునని వూహించారు దర్యాప్తు అధికారి. కాని హొటల్ రిజిష్టర్‌లో మాత్రం యువకుడు తన అడ్రసు "ఎన్. శంకర్, వ్యాపారి, వైజాగ్" అని రాశాడు. ఆగంతకుడు కావాలనే తప్పుడు వూరు, పేరు ఇచ్చి వుండవచ్చుననుకున్నారు దర్యాప్తు అధికారి. చందూర్ దంపతులు బసచేసిన గది సమీపంలో దుండగుడు మకాం వేయడమేగాకుండా ఆదివారం నుంచి అతను వారి గదిపై కన్నేసి వుంచినట్లు కూడా విచారణలో తేలింది.

ఇదిలా వుండగా సన్మాన సభలో అవార్డు అందుకుంటూ శ్రీమతి మాలతీ చందూర్, హొటల్, గదిలో జరిగిన తన నగల దోపిడీని గురించి ముఖ్యమంత్రికి తెలియజేశారు. "దోపిడీలో నగలన్నీ పోయినందువల్ల సన్మాన సభకు నేను గాజులులేకుండా రావల్సి వచ్చింది" అని ఆమె ఆవేదనగా అన్నారు. మొత్తం మీద ఈ కేసు నగర పోలీసులకు ప్రతిష్టాకరంగా తయారైంది.

హొటల్ గదిలో లభించిన చొక్కా ఆధారంగా వివరాలు సంపాదించడానికి దర్యాప్తు అధికారి శ్రీ ఫడ్కే నాయకత్వంలో ఒక ప్రత్యేక డిటెక్టివ్ బృందం అదే రోజు సాయంత్రం రెండు గంటల ప్రాంతంలో విజయవాడకు బయలుదేరింది. నగల దోపిడి సంఘటన వివరాలను అంతకుముందే రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు వైర్‌లెస్ ద్వారా పంపించడం జరిగింది. విజయవాడకు వెళ్లిన డిటెక్టివ్ బృందం అక్కడ వాకబుచేసి మరుసటి రోజు, గవర్నర్‌పేటలోని పెద్దిభట్ల వారి వీథిలో వున్న 'ఆర్.కె. టైలర్స్' షాపును గురించి ఆచూకితీసింది. శ్రీ వి. వెంకటేశ్వరరావు ఈ ఆర్. కె.

టైలర్స్ షాపు యజమాని. పోలీసులు అయనను విచారించగా ఈ షర్టు తాను కుట్టిందేనని, ఈ షర్టు తాలూకు వ్యక్తి నాలుగైదుసార్లు తన దగ్గర బట్టలు కుట్టించుకున్నాడని షాపు యజమాని వెంకటేశ్వరరావు వెల్లడించాడు. అతని దగ్గరున్న కస్టమర్ల కొలతలు పుస్తకం తెప్పించి చూడగా అందులోని వివరాలు కూడా ఈ విషయాన్ని ధృవీకరించాయి. ఈ వ్యక్తి విజయవాడలో టాక్సీ డ్రైవర్‌గా పని చేస్తుంటాడని కూడా ఆర్. కె. టైలర్స్ యజమాని తెలిపాడు. దీన్నిబట్టి హైదరాబాద్ హోటలు గదిలో దొరికిన చొక్కా ఎవరిదో తేలిపోయింది.

ఈ సమాచారం ఆధారంగా డిటెక్టివ్ బృందం సభ్యులు విజయవాడకు చెందిన ఇద్దరు కారు డ్రైవర్ల సహాయంతో మరికొన్ని వివరాలు సేకరించగలిగారు. అనంతరం విజయవాడలోని పలువురు టాక్సీ డ్రైవర్లను డిటెక్టివ్ బృందం వాకబు చేసింది. తాము గాలిస్తున్న ఈ వ్యక్తి పేరు జి. రమేష్ అని, విజయవాడ కాంగ్రెస్ ఆఫీసు రోడ్డులోని హోటల్ బృందావన్‌లో బస చేస్తుంటాడని, హోటలులో అతను ఒక రూమ్ తీసుకొని, గత నాలుగేళ్ళుగా అందులోనే వుంటున్నాడని టాక్సీ డ్రైవర్లు వెల్లడించారు. రమేష్‌కు మోహనరావు అనే స్నేహితుడు వున్నాడని, అతను కూడా టాక్సీడ్రైవరేనని ఈ విచారణలో తేలింది. ఇటీవల రమేష్ విజయవాడలో కన్పించినట్లు కూడా కొందరు టాక్సీ డ్రైవర్లు చెప్పారు.

డిటెక్టివ్ బృందం సత్వరం బృందావన్ హోటలుకెళ్ళి రమేష్ కోసం ప్రయత్నించింది. కాని లాభం లేకపోయింది. అప్పటికే అగంతకుడు అక్కడినుంచి వుడాయించాడు. అయితే బృందావన్ హోటలుగదిలో రమేష్‌కు చెందిన డ్రైవింగ్ లైసెన్సు, పాస్‌పోర్టును కనుగొని దర్యాప్తు బృందం స్వాధీనం చేసుకున్నది. రమేష్ స్నేహితుడైన మోహనరావు కోసం అన్వేషణ ప్రారంభమయింది. మోహనరావు స్వగ్రామం కృష్ణా జిల్లాలోని మైలవరం దగ్గరే వుంటుంది. ఆయన ఉగాది పండుగకు తన స్వంత వూరికి వెళ్లాడని తెలుసుకొని దర్యాప్తు బృందం అక్కడకి వెళ్లింది. అయితే పండుగ తర్వాత మోహనరావు, రమేష్ లిద్దరూ కలిసి ఎటో వెళ్లారని తెలిసింది. దీంతో విజయవాడకు తిరిగివచ్చిన దర్యాప్తు బృందం విజయవాడలోని మోహనరావు నివసించే ప్రాంతం మీద నిఘా వేసి వుంచింది. డిటెక్టివ్ బృందం వూహించినట్లుగానే మోహనరావు ఒకటి రెండు రోజుల్లో ఇంటికి తిరిగి వచ్చాడు. మాటువేసి వున్న డిటెక్టివ్ బృందం వెంటనే అతన్ని నిర్బంధంలోనికి తీసుకొని ప్రశ్నించడం జరిగింది.

మోహనరావు, దర్యాప్తు బృందానికి పూర్తిగా సహకరించడమే గాకుండా, తనకు తెలిసిన అన్ని విషయాలు వెల్లడించాడు. తీగలాగితే డొంక కదిలినట్లు నగల దోపిడికి సంబంధించిన వివరా

లన్నీ బయటపడ్డాయి. చోరీ నగలలో ఆరు గాజుల్ని కృష్ణాజిల్లా, మైలవరం లో ఒక వ్యక్తికి అమ్మినట్లు ఇతను చెప్పాడు. నగల దొంగతనంతో ఇత నికి ఎలాంటి సంబంధం లేకపోయి నప్పటికి, నిందితునికి ఇతను స్నేహి తుడు కావడం వల్ల చోరీ నగలను అమ్మడంలో రమేష్ ఇతన్ని ఉప యోగించుకున్నట్లు తేలింది. మోహన రావు ఇచ్చిన సమాచారం ఆధారంగా హుటాహుటిన కృష్ణాజిల్లాలోని మైల వరం వెళ్లి ఒక వడ్డీ వ్యాపారి దుకాణం నుంచి చోరీ నగల్లో ఆరు బంగారు గాజుల్ని యథాతథంగా డిటెక్టివ్ బృందం స్వాధీనం చేసుకున్నది. దీనితో కేసు మిస్టరీ చాలావరకు విడి పోయింది.

రమేష్, మోహనరావు లిద్దరూ మంచి స్నేహితులే కాకుండా కొంత కాలం పాటు టాక్సీ కూడ నడి పించారు. అయితే రమేష్ మధ్యలోనే ఆ వృత్తికి స్వస్తిచెప్పి నేర వృత్తి ఎన్నుకున్నాడు. రమేష్, మోహనరావు కలసి 1987 జనవరి నెలలో విజయ వాడలో ఒక టాక్సీని లీజుకు తీసు కున్నారు. ఈ టాక్సీని రమేష్ నడి పిస్తానన్నాడు. ఈ టాక్సీకి నెలకు అయిదువేల రూపాయల అద్దె. మొదటి నెల మాత్రం అద్దె చెల్లించాడు. అయితే రెండవ నెల నుంచి అద్దె యివ్వడం మానేశాడు. అంతే కాకుండా ఏదో అత్యవసరమైన పని ఉందని చెప్పి మోహనరావు దగ్గర ఆరువేల రూపా యలు అప్పుగా తీసుకున్నాడు. ఇంత వరకు ఆ డబ్బు తిరిగి ఇవ్వలేదు లీజుకు తీసుకున్న టాక్సీకి రమేష్ అద్దె చెల్లించకపోవడంతో 1987 మార్చి నెలలో టాక్సీ కారు యజమాని తన కారును తీసుకుపోయాడు.

హోటల్ గదిలో మాలతీచందూర్ నగలను దోచుకున్న తర్వాత నింది తుడు రమేష్ విజయవాడకు వెళ్లాడు. స్నేహితుడు మోహనరావును కలుసు కొని, తమ అమ్మ ఈ నగలు ఇచ్చిం దంటూ ఆరు బంగారు గాజులు చూపించి, వాటినిఅమ్మి పెట్టవలసిందిగా కోరాడు. నగలు అమ్మిన తర్వాత వచ్చిన డబ్బుతో మోహనరావుకు ఇవ్వవలసిన ఆరువేల రూపాయల బాకీ కూడా తీర్చగలనని మిత్రునికి నమ్మకంగా చెప్పాడు. వీరిద్దరూ కలసి కృష్ణా జిల్లాలోని మైలవరంకు వెళ్లి అక్కడ వడ్డీ వ్యాపారికి 12,100 రూపాయలకు ఆరు బంగారు గాజు లను అమ్మివేశారు.

"నీ బాకీ డబ్బు చెల్లిస్తాను గాని ముందు ఖుషీ చేసుకుందాం పద" అంటూ విజయవాడలో ఒక టాక్సీ మాట్లాడుకుని మోహనరావును తనతో పాటు తీసుకుని మొదట ఏలూరుకు, అక్కడి నుండి తణుకుకు వెళ్లాడు రమేష్. తణుకు వెళ్లిన తర్వాత ఒక చోట మోహనరావును, టాక్సీని ఉంచి ఇప్పుడే తిరిగి వస్తానంటూ రమేష్ చల్లగా జారుకున్నాడు. రమేష్



మన నాట్యకళకు ఖండాంతర ఖ్యాతి తెచ్చిన
రా ధా రా జా రె డ్డి
దం ప తు లు

ఎంతకూ తిరిగి రాకపోవడంతో మోహనరావు జరిగిన మోసాన్ని గ్రహించి, టాక్సీడబ్బుకూడా తానే వెల్లించాడు. మోసపోయిన మోహనరావు విజయవాడకు తిరిగి రాగానే ఆయన కోసం అక్కడ వేచిఉన్న దర్యాప్తు సిబ్బంది అతన్ని కనుగొనడంతో ఈ వ్యవహారమంతా వెల్లడయింది.

* * *

దర్యాప్తు అధికారి డిటెక్టివ్ బృందంలోని సభ్యులను రెండు టీమ్‌లుగా విభజించి, రమేష్‌ను గాలించి పట్టుకోవడానికి రంగంలోకి దింపారు. ఈ టీమ్‌లు విజయవాడ నుంచి విశాఖపట్నం వరకు గల అనేక పట్టణాలలో దొంగకోసం అన్వేషణ జరిపాయి. అయినా నిందితుని జాడ దొరకలేదు. వెళ్లిన ఈ రెండు టీమ్‌లు నిరాశతో హైదరాబాద్‌కు తిరిగి వచ్చాయి.

ఇదిలా ఉండగా రెండు నెలల తర్వాత అంటే జూన్ నెల మొదటి వారంలో రమేష్ మద్రాసులో ఉంటున్నాడని దర్యాప్తు అధికారికి సమాచారం అందడంతో వెంటనే ఆయన ఒక సబ్-ఇన్‌స్పెక్టర్‌ను అక్కడికి పంపించారు. మద్రాసులో నెలరోజుల నుంచి ఒక ఫ్రెండు దగ్గర ఉంటున్న రమేష్, ఎస్.ఐ. అక్కడికి చేరుకునే సరికి రూమ్ ఖాళీచేసి ఉడాయించాడు. రమేష్ మద్రాసులోని స్నేహితుల ఇళ్లలో రెండు వి.సి.ఆర్.లను, ఒక టూ-ఇన్-వన్ సెట్‌ను కూడా దొంగిలించి అమ్ముకున్నాడని తెలిసింది. అంతేగాకుండా నిందితుడు చోరీ నగల్లోని ఒక బంగారు గొలుసును మద్రాసులో ఓ ఫ్రెండు సహాయంతో పదిహేను వేల రూపాయలకు అమ్మివేసినట్లు కూడా విచారణలో వెల్లడయింది. మద్రాసులో అమ్మిన దుకాణాన్ని సబ్-ఇన్‌స్పెక్టర్ కనుగొని దాన్ని స్వాధీనం చేసుకున్నారు. అయితే నగను కొన్న కంసాలి అప్పటికే ఆ నగను కరిగించినందువల్ల కడ్డీ రూపంలో ఉన్న బంగారాన్ని ఎస్.ఐ. స్వాధీనం చేసుకున్నారు.

ఇంతలో నేరస్థుడు బొంబాయికి మకాం మార్చాడని సమాచారం రావడంతో వెంటనే అక్కడికి బయలుదేరవలసిందిగా మద్రాసులోని సబ్-ఇన్‌స్పెక్టర్‌కి దర్యాప్తు అధికారి ఫడ్కే వర్తమానం పంపించారు. అయితే బొంబాయిలోని ఒక హోటలులో బస చేసిన నిందితుడు రమేష్, క్రితంరోజే గది ఖాళీ చేసి వెళ్లిపోయినాడని అక్కడికి వెళ్లిన పోలీసు అధికారి కనుగొన్నారు. మళ్లీ అక్కడ కూడా నిరాశే ఎదురైంది.

ఇలా పోలీసులకు పట్టుబడకుండా తప్పించుకు తిరుగుతున్న రమేష్, హైదరాబాద్‌కు వచ్చినట్లు దర్యాప్తు బృందానికి ఆగస్టు 23వ తేదీన సమాచారం అందింది. దీంతో హైదరాబాద్ నగర డిటెక్టివ్ పోలీసులు వల పన్ని రమేష్‌ను పట్టుకున్నారు. అరెస్టు చేసిన తర్వాత రమేష్ దగ్గరున్న నగదును,

చోరీ వస్తువులను డిటెక్టివ్ పోలీసులు స్వాధీనం చేసుకున్నారు. నిందితున్ని ప్రశ్నించి చోరీకి సంబంధించిన అన్ని వివరాలను రాబట్టారు. పరిశోధనలో సంపాదించిన వివిధ ఆధారాలతో నిందితునిపై పోలీసులు కోర్టులో చార్జి షీటు దాఖలు చేయడం జరిగింది. హోటలు గదిలో దొరికిన అతి చిన్న క్లూ ఆధారంగా మిస్టరీని ఛేదించి దొంగను పట్టుకున్న ఘనత నగర డిటెక్టివ్ పోలీసులకు దక్కింది.

మంచి సంప్రదాయ కుటుంబంలో పుట్టినప్పటికీ చెడు సావాసాలకు అలవాటు పడిన రమేష్ చివరకు దొంగగా మారినట్లు పోలీసుల విచారణలో తేలింది. ఇతని తండ్రి శ్రీ జి. గంగారావు ఏలూరు కో – ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకులో జనరల్ మేనేజరు. ఏలూరులో వారి నివాసం. ఇంట్లోంచి డబ్బు, చిన్న చిన్న వస్తువులను దొంగతనం చేస్తుండడంతో విసిగిపోయిన తల్లితండ్రులు రమేష్‌ను 1983లోనే ఇంట్లోంచి పంపివేశారు. బి.కాం. మొదటి సంవత్సరం వరకు చదువుకున్న రమేష్ మంచి మాటకారి. 32 ఏళ్ల వయస్సు గల జి. రమేష్-రాంబాబు, పి. శంకర్ అనే మారుపేర్లతో కూడా చెలామణి అవుతుంటాడు. ఖరీదైన దుస్తులు ధరించడం, ఎప్పుడూ టాక్సీలలో ప్రయాణం చేయడం, విలాసవంతమైన హోటళ్లలోని ఏ.సి. డీలక్స్ గదుల్లో బస చేయడం, మందు, మగువల మీద ఇష్టం వచ్చినట్లు ఖర్చు చేయడం నేరస్తుని అలవాట్లు. ఎంతో పకడ్బందీ పథకంతో నేరస్థుడు హోటల్ గదిలో నగలను దోపిడి చేసినప్పటికీ దర్యాప్తు బృందం ప్రతిభ, పట్టుదల వల్ల దొంగ పట్టుబడక తప్పలేదు.

ఈ కేసును విచారించిన అయిదవ మెట్రోపాలిటన్ మేజిస్ట్రేట్ గారు నేరస్థుడు రమేష్‌కు ఆరునెలల సాధారణ జైలుశిక్ష 5 వేల రూపాయల జరిమానా విధిస్తూ 24-11-1987 నాడు తీర్పు చెప్పారు.

ఆంధ్రప్రదేశ్
పోలీసు మాస పత్రిక
'సు ర క్ష' సౌజన్యంతో

పేరు ప్రఖ్యాతులనేవి యువతలో గల సహజ తృష్ణ.

* * *

వక్ర భాష్యం చెప్పగలిగేటంతటి పాండిత్యం సంపాదించాడతను.

* * *

ఏథెన్స్ సుందరీ, మనమిక విడిపోవాలి- నీవు తీసుకున్న నా హృదయం వెనక్కి యిచ్చేయ్.

* * *

పర్వత శిఖరాలు కూనిరాగం తీస్తాయి; పెద్ద పట్నాలు నానా యాతనా పెడతాయి.

* * *

నేను మనుషుల మతాల గురించి మాట్లాడను - మతాలన్నీ దేవునికీ మనిషికీ మధ్య నిదురిస్తాయి.

— బైరన్

